# గులాబి రేకులు

**(PETALS OF ROSES)**



బెజవాడ గోపాలరెడ్డి

# GULABI REKULU
(Petals of Roses)

ప్రథమ ముద్రణ
సెప్టెంబరు 1990



వెల : పది రూపాయలు

ప్రతులకు :
**ఆంధ్ర సారస్వత పరిషత్తు**
తిలక్‌రోడ్, హైదరాబాదు-1

ముద్రణ :
శివాజీ ప్రెస్, 4-4-53,
గంజ్‌బజార్, సికిందరాబాదు.

# గ్రంథకర్త జీవన వివరాలు



జననము — 5 ఆగస్టు, 1907
బుచ్చిరెడ్డిపాలెం, నెల్లూరు జిల్లా.
తండ్రి-పట్టాభిరామిరెడ్డి
తల్లి-సీతమ్మ.

చదువు —బుచ్చిరెడ్డిపాలెం, నెల్లూరు.
ఆంధ్ర జాతీయ కళాశాల
(1921-24).
విశ్వభారతి
(1924-27).

సమర పర్వము — సర్కారుబడి వదులుట— జనవరి 1921.
జైలు శిక్షలు - ఆరు మార్లు.
1930, 31, 32, 33 లోను,
1940, 41, 42, 43 లోను,
కొంతభాగాల్లో జైలులో ఉండినారు. దాదాపు
4 సం॥లు జైలులో మకాం. ఎ బి సి క్లాసుల
ఖైదీగా, డిటెన్యూగా.

ఉద్యోగ పర్వము —మంత్రిగా-మద్రాసు, కర్నూలు,
హైదరాబాదు, ఢిల్లీలలో-186 మాసాలు.
గవర్నరుగా-ఉత్తరప్రదేశ్‌లో 62 మాసాలు.
ఆంధ్ర విశ్వవిద్యాలయ ప్రోఛాన్సలర్-
జూన్ 1951 నుండి 57 వరకు.

సాహిత్య పర్వము—తెలుగు భాషా సమితి అధ్యక్షులు-1948 నుండి 1986
వరకు; ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ-ఆగస్టు
1957 నుండి డిసెంబరు 1982 వరకు;
కేంద్ర సాహిత్య అకాడమీ
1978 జనవరి నుండి 82 డిసెంబరు వరకు,
83 జనవరి నుండి రెండవతూరి;
జ్ఞానపీఠము-1963 నుండి 1971 వరకు.
రాజాలక్ష్మి అవార్డు (మద్రాసు) 1989
డా॥ కె.వి. రావు, డా. జ్యోతీరావు అవార్డు (న్యూయార్కు)
1990.
సాహిత్య అకాడమీ, న్యూఢిల్లీ 1990 (అనువాద బహుమతి)

# బెజవాడ గోపాలరెడ్డి

## పుస్తకాలు

### వేయి సోయగములు

'ఆమె' పంచకము

1. ఆమె (1978)
2. ఆమె జాడలు (1981)
3. ఆమె నీడలు (1981)
4. ఆమె తలపులు (1982)
5. ఆమె పిలుపులు (1982)
6. స్ఫులింగాలు-తుషారాలు (1984)
7. స్వప్నహారం (1986)
8. చినుకులు (1988)
9. కవితలు (1989)

### దీర్ఘ కవితలు

'కవితా' పంచకము

10. కాలవాహిని (1979)
11. సాహిత్య సుందరి (1980)
12. ప్రసూన మంజరి (1981)
13. పరిమళ తరంగాలు (1982)
14. సాగర సమీరాలు (1983)
15. మలయ మారుతాలు (1985)
16. సౌరభ నీరాజనాలు (1987)
17. శశాంక రేఖలు (1984)
18. గులాబి రేకులు (1990)

### ఉర్దూనుంచి

1. గాలిబ్ ప్రేమకలశం
2. అల్లామా ఇక్బాల్ కవితలు
3. ఫిర్యాదు—జవాబు (ఇక్బాల్)

### రానున్నవి—

1. హంస మాలికలు
2. పుష్పమాలికలు

### బెంగాలీ నుండి (రవీంద్రునివి)

1. దేవయాని-చిత్రాంగద
2. మాలిని
3. ప్రకృతి-ప్రతీకారము
4. విసర్జన
5. ఆరు నాటికలు (సాహిత్య అకాడమీ అనువాద బహుమతి లభించినది)
6. కథలు-కల్పనలు
7. వాన చినుకులు
8. ఊర్వశి
9. కాళిదాసు
10. తాజ్‌మహల్
11. నైవేద్యము—స్మరణ

# అంకితము

శ్రీ యస్. వి. పి. పట్టాభిరామరావుగారు

కపిలేశ్వరం — తూర్పుగోదావరి

పెక్కుయేడుల స్నేహ చిహ్నంగా అభిమానములతో
అర్పించుచున్నాను.

# నివేదన

'గులాబిరేకులు' సహృదయులకు అర్పించుచున్నాను. ఇది నా రేఖా చిత్రములలో రెండవది. సొంతపుస్తకాలలో పద్దెనిమిదవది.

1977 మే మాసంలో ప్రారంభమైన నా సాహిత్యయాత్ర ముక్తకాల, దీర్ఘ కవితల మజిలీలను దాటి, రేఖాచిత్రాల వీథిలో సాగుచున్నది. ప్రయాణము పూర్తి అయ్యే స్థితిలో ఉన్నదేమో! ఇక రెండు మూడు పుస్తకాలు ప్రచురించబడితే జాస్తి. అనుకోని విషయాలు కొన్ని కొన్ని జరుగుచున్నవి జీవితములో. దేనికైనా పరితృప్తే. నిరాశలేమీలేవు. చూస్తాము ముందుకథ. ఉన్నదానితోనే సంతోషము. లేనివి చాలా ఉన్నవి. వానికై వగపులేదు.

గులాబిరేకులలో కొంతకొంత రాజకీయ వాసనలు కొట్టుచున్నవి. వ్యక్తులకు సంబంధములేని రాజకీయాలే. నా భావాలను ఆవిష్కరించేవే. నేను రాజకీయాలనుండి బయటపడ్డా, అవి నన్ను అంటుచునేయున్నవి. ప్రమాదములేని సంబంధము. పాతచుట్టరికాలు తుడిచివేస్తే పోతాయా? కొంత హాస్యము ఉండనే ఉంటుంది. రసహృదయులు గమనించగలరు.

వద్దనుకొన్నా, అలవాటైన ముక్తకాలధార ప్రవహిస్తునే యున్నది. 17 ముక్తకాలను ఇందుచేర్చాను. అవి భావగుళికలు. వాటినీ కొంత చప్పరించండి.

41 వ పుటనుండి రెండవభాగము. మొదటి రెండు 17, 18 శీర్షికలు నా చిన్ననాటి సాహిత్య ప్రయత్నాలు. నేను పంపిన వ్యాసాన్ని కృష్ణాపత్రిక సంపాదకీయ వ్యాసముగ ప్రచురించి ప్రోత్సహించింది. 1934నాటి మాట. నా 26యేడుల ప్రాయాన, నా తప్పటడుగుల నడకను గమనించండి. 18వ శీర్షిక ప్రేమ స్వరూపము. ప్రేమను 20 ఉపమలతో చిత్రించినాను. నా దీర్ఘ కవితలలోని పుస్తకాల గదినిగూర్చి డాక్టరు సంజీవదేవ్ వ్యాఖ్యానిస్తూ, గోపాలరెడ్డికి ఉపమలంటే చాల ప్రియమని తోస్తుంది అన్నారు. ఆ ఉపమల చెట్టువేళ్లు 1936 లో ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచికలో ప్రచురింపబడిన ప్రేమస్వరూపములోనే ఉన్నవేమో! ఉపమల జాడ్యము తొలుతనుంచి ఉన్నదేమో. 1977 తర్వాత వచ్చి

నది కాదనితోస్తుంది. కాదంబరి ప్రభావమా అని నాలో నేను అనుకొంటుంటాను. దాని కవితాశక్తి, పాండిత్య విశేషము నాలో లోపించినా, ఉపమలు నన్ను పట్టు కొన్నవేమో ! సాహిత్య ప్రయాణాలకు కొన్ని ఊతకర్రలు ఉండాలిగదా ! కొంత దారి బత్తాలు అవసరమే అని తృప్తి పడుతుంటాను.

22వ శీర్షిక వజ్రోత్సవము—స్వర్ణోత్సవము. నా తొలి జైలుశిక్ష 1930 లో. దానికి 60 యేండ్లు నిండాయి. దానినే వజ్రోత్సవమన్నాను. 1939లో నేను మాజీ మంత్రినైనాను. 1989లో 50 యేండ్లు నిండాయి. దానికి స్వర్ణోత్సవమన్నాను. జైలుశిక్షకు, మాజీ మంత్రిత్వానికి ఉత్సవాలు జరుపుకొన్న ఘనత నాదే. ఏదో నా ప్రత్యేకతను ప్రదర్శించాను.

కడపటి శీర్షిక 'భిన్న దృక్పథాలు' ఒకే వస్తువును వేరువేరు కోణాలనుండి చూస్తే వేరు వేరు భావాలు తట్టవచ్చును. ఒకరికి నచ్చింది మరొకరికి నచ్చక పోవచ్చును. లోకో భిన్నరుచిః అన్నారు పెద్దలు. నేను మంచి అనుకొన్నది, యితరులకు నచ్చలేదు. విమర్శించారు, విచారించారు. 86 పేజీనుండి నా సమాధానమున్నది. మొత్తముమీద అంతా ఆసక్తిదాయకముగనే నడిచింది కథ. చదువరులు గమనించ ప్రార్థన.

మొత్తముమీద గులాబీరేకులు సహృదయ పాఠకులకు కొంత ఆసక్తిని కొంత వినోదమును కలిగించగలదని ఆశించుచున్నాను.

శాంతినికేతన్ బెజవాడ గోపాలరెడ్డి

నెల్లూరు-3,

28-8-90,

# శీర్ష సూచిక

1943 లో బెల్లారు జైలులో నిర్బంధితునిగా యుండిన సమయంలో రవీంద్రుని కొన్ని కావ్యనాటికలను అనువదింప ప్రారంభించాను. తొలుత కచ–దేవయాని నాటకమును, తర్వాత చిత్రాంగద (ఇంగ్లీషులో చిత్రా) నాటికను అనువదించితిని. ఆ రెండు నాటికలను ఒకే సంపుటిగా ప్రచురించాను, హిందీ ప్రచార సభవారి ప్రెస్సులో ముద్రించి, ఆ సంపుటానికి కృష్ణాపత్రిక సంపాదకులు శ్రీ ముట్నూరి కృష్ణారావుగారు వారి దర్బారులో ఒక సాయంత్రం వారి మిత్రులతో కలిసి నేను చదవగా విన్న తరువాత వారి ముందుమాటలు వ్రాశారు. నాకు తెలిసి ఆయన ఏ పుస్తకానికి ముందుమాటలు వ్రాయలేదేమో ?

# ముముక్షువులకు పరిచయ వాక్యములు

ఏ వినీలాకాశ గర్భము నుండి, ఏ యుగారంభ సంరంభమున, భారత పరిజ్ఞానామృతము అవనికి దిగివచ్చెనో, ఎవరు చెప్పగలరు ? ఇయ్యది కాలము వలెనే అనంతము—ఆకసము వలెనే సర్వవ్యాప్తము !

కొండొక కాలమున ఉషఃకాంతులు తమస్సులను జీల్చుకొనుచు చేతనా ప్రకృతిని మేల్కొలుపుచుండ, మన పూర్వులు విస్మయానందముల నోలలాడుచు మంచుతెరల చాటున మూర్తులుగనో, అమూర్తులుగనో, దృశ్యాదృశ్యముగ గోచరించు జగదంతర ప్రవర్తకులైన దేవతల పరిచయము గావించుకొని ఋక్సామములలో ఉద్గీథములను పాడ దొడగిరి.

క్రమముగా—దేశ కాలముల ఎల్లలు కూడ దాటి, అవాఙ్మానస గోచరమైన అఖండ సచ్చిదానందమును స్పృశించి—ఔపనిషదిక రహస్యములను ముక్తకంఠముతో నుద్ఘాటించిరి.

అటుపిమ్మట, భారత విజ్ఞాన మహాతరంగిణి జాహ్నవివలె హిమాలయోత్తుంగ శృంగముల నుండి దుమికి, సాంద్రారణ్యముల నిబిడచ్ఛాయల విశ్రమించుచు, మానవ లోకమునందు ప్రవహించి, మానవుని కళ్యాణ గుణములను మూర్తీభవింప జేసుకొనిన అవతార పురుషుల లీలావిలాసములను ప్రతిఫలింప జేయ, పురాణేతిహాసములను చిత్రించిరి.

అంతెక్కడిదీ జ్ఞానధారకు ? ఒకప్పుడు జ్యోత్స్నవీచికయై, శుభ్ర హిమ ఖండములతో క్రీడించుగాక ! స్నిగ్ధ జాహ్నవియై గగన చుంబిత శృంగముల నుండి ఉరికి వనాంతర సీమలయందు విజయ విహార మొనరించుగాక !

మరి ఒకప్పుడు ఆ అమల విమల వాహిని రాజాధిరాజుల నికటముననో, జనపదముల చెంతనో, శీతకణములను వెదజల్లుచూ మానవుని సేద దీర్చుచుండు

గాక ! కాని ఈ వాహిని అవిచ్ఛిన్నము, లోక సంతాపహరము, బ్రహ్మానంద సంధాయకము.

* * *

దీని నిర్మాణ శక్తియు అత్యద్భుతము : ఇయ్యది పర్వత శ్రేణులను సహితము తొలచి, అందు విజ్ఞాన దీపములను వెలిగించినది. సాంద్రారణ్యములలో ఆశ్రమములను, పర్ణకుటీరములను నెలకొల్పి తత్వసారము చిలికించినది.

కవి బృందములను సృష్టించి, వారి కావ్యరంగములపై దివ్య సుందరియై నర్తించినది. శిల్ప భూములలో పసిడి తళుకుల గోపురములను నిర్మించుకొని, నీరాజనములతో కళారాధనల నందినది.

ఎట్టి సృజన శక్తి ఇది ? ఎన్ని దర్శనములు, ఎన్ని మతములు, ఎన్ని సంప్రదాయములు, ఎన్ని సాధన విధానములు, పాథోధిలోని తరంగ సంతతుల వలె ఉద్భవించి తన గంభీర సమృద్ధిని వెల్లడించ గలిగెను.

భారతేతిహాసమున ప్రతిఘాతములైన ఘట్టములు సంఘటింపకపోలేదు. కాని వానికి భారతశక్తి వంగి నేలకూలెనా ? లేదు. రోషముతో బరాక్రమించెనా యనునటుల, తరంగితమై ఘూర్ణిల్లి, కూలములనుగూడ దెగగోసుకొని, ప్రాంత ప్రాంతమునకు, నగర నగరమునకు పల్లె పల్లెకూ పరువులెత్తి బహుళ వ్యాప్తి నొందినది.

విభిన్న దేవతోపాసకుల మధ్య వివాదములు పెరిగి సంఘర్షణలు కలిగి నప్పుడు మహోదారులైన ఋషిపుంగవులు బయల్వెడలి "ఏకం సత్ విప్రా బహుధా వదన్తి" అను మహావాక్యమున విశ్వైక్యతను జాటిరి.

మరి ఒక సంఘట్టనమున శ్రీ కృష్ణభగవాను డవతరించి, సకల దర్శనములను సమన్వయపరచుచు, భక్తి జ్ఞాన కర్మములకు ఏకవాక్యతను గూర్చెను.

ఇంకొక ప్రదోష కాలమున బుద్ధదేవుడు ఏతెంచి, లోక దుఃఖ నివృత్తి సాధకమైన కరుణరసము దేశదేశముల వెల్లి విరియునట్లు ప్రవహింప జేసెను.

ఇస్లాం సభ్యతా సంఘట్టనమున చైతన్య, చండీదాస్, కబీర్, నానక్, తులసీదాస్, రామదాసుల వంటి భక్తవరేణ్యులు శ్రేణులు దీర్చి జాతి, మత, భాషా

విచక్షణల నతిక్రమించి సార్వజనీనముగ, భక్తి రసామృతమును—మాతృభాషలలో, దేశీయ గీతములలో, జీవన సరళ సంబంధములలో, పాడి, ఆడి, వెదజల్లి భారత సంస్కృతిని నవనవోన్మేషశాలినిగ నొనర్చిరి.

ఇటీవల పాశ్చాత్య నాగరకతా పదాఘాతమునకు భారతవర్షము దద్దరిల్లి, స్వధర్మ భ్రష్టమగుచుండ. చందన తరువును నరికిన కొలది పరిమళమును వెదజల్లు రీతి భారతావని యందెందరో మహానుభావులు జాగరితులై, ప్రాక్తన దివ్య విజ్ఞానమునువ్యక్త మొనరించి ఖండ ఖండాంతరములు భారత జ్ఞాన సంపత్తికి మోకరిల్లునట్లు చేసిరి.

* * *

ఈ జ్ఞానోద్ధారకులలో ముఖ్యముగ ముప్వురు మనీషులు నవ్య భారత భాగ్యోదయమునకు త్రిమూర్తులా యనునట్లుద్భవించిరి. శ్రీ అరవింద యోగీంద్రుడు, శ్రీ కరుణ చంద్రమోహన్‌దాస్ గాంధి, శ్రీ రవీంద్రనాథ్ కవిచంద్రుడు.

భారత విజ్ఞాన శక్తి సత్యమును వ్యవచ్ఛేదనము గావించి అంగ ప్రత్యంగ పరిశీలనము చేయగలదు—ఒక్కుమ్మడి సమగ్ర సమన్వయ దృష్టితో అఖండ తత్వమును తిలకించగలదు.

భారతీయుని తత్వదృష్టికి రెండు చూపులు గలవు. సముద్రతీరమునందలి ఇసుకరేణువులను ఒక్కొక్కటి తీసి లెక్కపెట్ట సాహసించును—సముద్రమునంతకు ఆపోశనము పట్టి ఒకమారు "స్వాహా" అనగలరు.

భారత గణిత శాస్త్రజ్ఞులు గ్రహ గ్రహముల, నక్షత్ర నక్షత్రముల గమనముల, పరిభ్రమణముల గుణించి, శాస్త్రీకరించిరి. వారే అఖిలాండ బ్రహ్మాండ కోటుల నతిక్రమించి, లెక్కలకు, కొలతలకు అందని అనంత ధామమునకు గొంపోయిరి.

భారత కళాభిజ్ఞులు ప్రకృతి పురుషులకు అనంతరూపములను గల్పించి అంగప్రత్యంగ వివరణములను హృదయరంజకముగ జిత్రించిరి. ఈ పార్థివ భేదముల నతిక్రమించి సచ్చిదానందముయొక్క అఖండతత్వమునకును మూర్తి

కల్పనజేసిరి. భారత దర్శకుని తీక్ష్ణదృష్టి అణువును గనుపెట్టగలదు. అవ్యక్తమైన మహత్తును తిలకించి, నిరతిశయానందమున నోలలాడగలదు.

భారత జ్ఞానసంపదయొక్క విశిష్టత ఈ త్రిమూర్తులయందును ప్రస్ఫుటముగ వ్యక్తమగుచున్నది. వీరి దృష్టి వజ్రభేదివలె లోతోతులలోకి జొచ్చుకొనిపోగలదు. అన్నిటిని మించిన అతీతమునకు ఎగురగలదు—కనుకనే వీరు పశ్చిమ ఖండవాసుల వైజ్ఞానిక పరిశీలనా పటిమను ప్రాచ్యదేశాల సమగ్ర భావనాశక్తిని తమయందిముడ్చుకొని నూతన సమన్వయమునకు దారి తీయగలుగుచున్నారు.

శ్రీ అరవిందుడు బ్రహ్మవిద్యా గరిష్ఠుడై మానవుని మర్త్యజీవనమును సహితము దివ్యజీవనముగ పరిణతి నొందించగల "పూర్ణయోగ" విధానమును ఉదాత్తస్వరమున నుద్బోధించుచున్నాడు.

గాంధీమహాత్ముడు — జాతీయ దురహంకార పరితప్తమైన పృథివిని శాంతింపజేసి, విశ్వమైత్రీ భావమున నేకమొనర్చుటకు అహింసా ధర్మమును అపూర్వరీతిని ఆచరించి ప్రదర్శించుచున్నాడు.

ఇక మన మధురమూర్తి రవీంద్ర కవిచంద్రుడు, ప్రపంచమును సమ్మోహపరచునటుల "విశ్వభారతి" గీతములను సర్వప్రపంచమునకు అంజలిగ నివేదించి, రసజగత్తు యొక్క సౌందర్య శోభ ననుభవింప జేయుచున్నాడు.

ఈ త్రిమూర్తులు భారతవర్షమున ఏకకాలమునందు ప్రభవించి, విశ్వకల్యాణ గీతమును ముక్తకంఠములతో నాలపించుట ఈశ్వరుని నవ విధానము గాక మరియేమగును ?

భారత సభ్యత విశిష్ట లక్షణములు గలదనుట సత్యము. కాని ఇది ప్రత్యేకముగ ఏ భూభాగపు ఎల్లల మధ్యను బంధింపబడునది కాదు. ఏ జాతీయ సంప్రదాయమునందును ఇముడునది కాదు. అది సత్యమువలె నిత్యమై, విశ్వవ్యాప్తమై వెలుగొందుచు, భరతవర్షము జగద్గురు పీఠముగ నుండుటకు దగిన సంస్కార యోగ్యతను, జ్ఞానబలమును ఒసగుచున్నది. ఈ గురుపీఠస్థానమునకీ త్రిమూర్తులకంటె అధికారులెవరు ?

శ్రీ అరవిందుడు మర్త్యుని అమర్త్యునిగ జేయగల జ్ఞానబలమును, మహాత్ముడు ఆత్మశక్తియొక్క అమోఘత్వమును, శ్రీ రవీంద్రుడు ఆత్మసౌందర్య

గరిమను అపూర్వరీతిని—రణకోలాహలమునందు మునిగియున్న ప్రపంచము సహితము చెవియొగ్గి వినునటుల ప్రబోధింపుచున్నారు.

అరవిందుని దార్శనిక గ్రంథములు ఆంగ్లమున నుండుటచే విదేశములలో నొకింత ప్రచారవ్యాప్తి గాంచిననూ, దేశమునందు ఎక్కువగా బఠింప బడుట లేదు. మహాత్ముని అహింసా తత్వము కర్మయోగసంబంధమైన దగుటచే వారి సేవాతత్పరతయే ప్రజలకు ప్రత్యక్ష ప్రబోధమగుచున్నది. అరవిందుని దివ్యోప దేశములను సులభముగా తెనిగించవచ్చును. మహాత్ముని కార్యప్రణాళికను ప్రక టించి వారి అహింసా మహత్తును నెరుకపరచవచ్చును.

కాని రవీంద్ర కవిచంద్రుని కవితా మాధుర్యము ననువదించు టెట్లు? రవీంద్రుని రచనలు కొన్ని ఆంగ్లీకరింపబడినవి. కాని అతని కవితలోని సార స్యము వానియందు మచ్చుకైనను గానరాదు. రవీంద్రుని గ్రంథములు కొన్ని ఇదివరలో తెనిగింపబడినవి. ఆ అనువాదములు, మాతృకలకు కొన్ని మైళ్ళ దూరములో నున్నవి. ఈ ప్రయత్నములను గాంచిన, కవిత కనువాదము దుస్సాధ్యము అనిపించును. త్యాగరాజాచార్యుని రాగమాధుర్యమును ఎవరను వదింపగలరు? "ఈథర్" ద్రావకము నొక సీసానుండి ఇంకొక సీసాలోనికి మార్చుటెంత దుస్సాధ్యమో, 'అభిజ్ఞాన శాకుంతల'మును ఆంగ్లీకరించుటంత కష్టసాధ్యమని మోనియర్ విలియమ్సు వెనుక వ్రాక్రుచ్చియున్నాడు.

గోపాలరెడ్డిగారు శాంతినికేతన పట్టభద్రులు. రవీంద్రుని ప్రియశిష్యులు. వంగ భాషాకోవిదులు. రవీంద్రుని కవితా మాధుర్యము నెటులైన సోదరాంధ్రు లకు జవిచూపవలెనని ఎంతకాలము నుండియో ఆవేదన పడుచుండిరి. దాని నెంతకాలము దాచియుంచగలదు కవితాహృదయము?

నేడు—సాహసమే కానిండు, ముందుగ రెండు నాటికలను ఆంధ్ర లోకము నకు బ్రసాదింప సమకట్టిరి. కాని రవీంద్రుని భాష—ఆ కాలమున సంస్కృత పద భూయిష్ఠమై యుండుటచే, ఆ భాగములను తెలుగు లిపిలో లిఖించిన, దాని మాధుర్యమును గొంతవరకు గ్రోలగల్గుదుము. రెడ్డిగారు సాధ్యమైనంతవరకు రవీంద్రుని పదముల కూర్పును, ప్రయోగముల రీతిని, శయ్యావైఖరిని నిలువ ప్రయత్నించిరి. ఇందు మూలమున తెలుగు నుడికారమునకు గొంతకొరత వాటిల్లి నను, రవీంద్రుని పలుకుబడిని మనకొకింత శ్రుత పరుపగలుగుచున్నారు.

రవీంద్రుని భాషా శైలి వానిదే కాని, అనుసృతమైనది కాదు. కవి నిరంకుశ ప్రభువు. అవ్యక్తమైన రసానుభవమును వ్యక్తపరచుటకు ప్రతిభాశాలియైన కవి తన భాషను తాను సృష్టించుకొనును. మానవుని స్వప్రయోజనముల కొరకు కల్పించుకొన్న వ్యావహారికభాష కవులకు జాలదు. మానవుని భాష అర్థముల బంధించుకొని వ్యావహారిక ప్రయోజనములకొరకు సంకుచితమై, ఒక పరిమితిని బొందునని రవీంద్రుడే "నారద — వాల్మీకి" సంవాదమున బహురమ్యముగ వర్ణించినాడు. ప్రభావ శుభ్రభాషవలె, యామినీ శాంతివాణివలె, నక్షత్రముల నిశ్చల ధ్రువగానమువలె, దక్షిణ సమీరముల ఉచ్ఛ్వాసలవలె—తన భాషకూడ అర్థబంధముల నతిక్రమించి, ఏకస్రోతమున సంగీత తరంగముల మేళవించి, యౌవన విజయగానముల గావించవలెనని రవీంద్రుడు విశ్వవిపంచిని మ్రోయించెను.

వాల్మీకి ముఖతః ప్రతిధ్వనింప జేసిన ఈ దిగువ వాక్యములు రవీంద్రుని భాషాసంపదను చెప్పకయే చెప్పెను—

"మానవుని జీర్ణవాక్యములకు నా ఛందము నవస్వరముల నొసగి, ఉద్దామ సుందరగమనము నొనగూర్చి, పక్షవంతపగు అశ్వరాజసమముగ, అర్థబంధముల నుండి తప్పించి, భావ స్వతంత్రలోకమున గొండొకదూరము గొంపోగలదను నాశ్వాసమున నా చిత్తము దేలుచున్నది.''

* * *

రవీంద్రుని కౌమారదశలో రచించినవి రెండు-కచదేవయాని, చిత్రాంగద-నాటికలు. వసంతఋతు సమాగమమున, యౌవన విలాస సంపద లొక్కుమ్మడి యెట్లు విజృంభించి, ఉన్మత్తత కలిగించునో, అట్టి ''కైపే" ఈ నాటికలును కలిగించును.

ఆనాడు రవీంద్రుడు కేవలము రసోన్మాదుడు. మత్తేభమువలె కృతోద్యాన వనముల విహరించి, కమల కాసారములలో అవిచ్ఛిన్నముగ నీదులాడుచు, హస్తరంధ్రముల నీరెక్కించి, పూరించి, వియత్పథంబున విరియజిమ్ముచూ, కోమలాట్టహాసము గావింపు నొకతూరి :— మరి ఒకమారు, లతానికుంజముల విదలించి, కుసుమ సంతతులను లాలించి, మూగిన మధుప సంతతులను ఆదరించి, బెదరించి, ఆనంద రసోన్మత్తుడై అతిశయించును.

మరి ఒకమారు పర్వతసానువులపై నెగ్రబ్రాకి, అచ్చట స్వైర విహార మొనరించు అప్సరాంగనల పూవుపెదవుల సాధ్వసము రగిలించి విహ్వలుడవును —ఇంకొకతరి తన మత్తకుంభముతో చందనతరువులపైబడి పోరాడి దిక్కు దిక్కులకు పరిమళమును విరజిమ్మి క్రీడించును.

మరి ఒకప్పుడు పర్వత శిఖరములపై శాంతిధ్యాన నిమగ్నులైన తపోధనులను సమాధుల నుండి అల్లన మేల్కొలిపి వారి జితేంద్రియత్వమును పరీక్షించును.

ఇంకొక మారు పర్వత సానువుల నుండి దుమికి కేరింతలాడుచు జరజర పల్లెల పూరి గుడిసెల ముందు ధూళి ధూసరితములైన కోమల శరీరములతో చిందులాడుకొను పిల్లగాండ్ర నెత్తి పీపుపై నిడుకొని, గంతులు వేయుచు ఏ వాత్సల్య రసజగత్తుకో మోసికొనిపోవును —

అయ్యది భావోన్మాదక్రీడ, రసావేశావస్థ యందలి చిద్విలాసము, భూమిని స్వర్గమును ఐక్యపరచి మానవుని దేవ పీఠమున ఆసీనుని చేయగల సాధనా మహిమ అది.

పవిత్ర భరతవర్షమున తత్వజ్ఞులు, యోగులు, శిల్పులు, కవులు, కళాభిజ్ఞులు ఏకశ్రేణికి చెందిన ద్రష్టలు:—స్రష్టలు. వారి ఉపకరణములు భిన్నములు; కాని, లక్ష్యమునందు ఒకటే సిద్ధి—అద్వైత సిద్ధి.

రవీంద్రుని రచనామృతమును గ్రోలగల్గిన శ్రీమంతులు ఆనంద భోగులు కాకుండ నెట్లుండగలరు? శ్రీ గోపాలరెడ్డిగారు ఈ ప్రథమ కుసుములతోబాటు, క్రమక్రమముగ రవీంద్రుని ఇతర రచనలను కూడ ఆంధ్రలోకమునకు అందించి విశ్వభారతి పూజను వ్యాపన మొనర్చెదరు గాక!

—ముట్నూరి కృష్ణారావు

(ఆగస్టు 1944—బందరు)

# సంవత్సరాల సిద్ధి

స్వరాజ్యం ప్రాప్తించి నలుబది సంవత్సరాలు. ఇంకా ఎన్ని నలుబదియేడులు దాటాలనో! నలుబది యేడులు కాదు, నలుబది దశాబ్దాలు, నలుబది శతాబ్దాలు. మనము ఉండము. మానవత్వము ఉంటుంది. కనిపించకనే వికసిస్తూ ఉంటుంది. మన మనవళ్ళ మనమలు, వారి మనమలు ఆనాటి అరుణోదయాలు చూస్తారు. ఆనాటి వర్షించేమేఘాలు చూస్తారు. కురవని మబ్బులను చూస్తారు ప్రకృతిలో కొంత నిలకడయున్నది రుతుశోభలు ఇప్పటివలెనే రమ్యంగా ఉంటాయి. మార్పులు చూపిస్తూనే ఉంటాయి. వసంతము నవ్వుచునే వస్తుంది. దాని పాద పారాణియన్నట్లు దారుణముగ ఎండలు కాస్తూనే యుండును. ఎంత స్థిరత్వమో, అంత చంచలత్వము.

కాని మానవుని భవిష్యత్తు ఏమిటో ఊహించలేము. భవిష్యత్తు సొరంగములలో అణగియున్న ప్రకృతిశక్తులు బయట పడుచూ వస్తాయి. గుర్తింపులేని మార్పు చెందుతుంది సమాజము. విజ్ఞాన దిగంతములు విస్తరిల్లుచునే ఉంటాయి. మనము పురోగమిస్తుంటే, అవి తిరోగమిస్తూనే ఉంటాయి. ఎంత

ప్రగతో అంత ప్రమాదము. నకు స్వాగతమియ్యగలవు. హారతుల పట్టగలవు. అనూహ్యము మానవత్వపు భవిష్యత్తు.

నేడు స్వరాజ్యోదయాన్ని స్మరిస్తూ, పెక్కు చీకటి కిటికీలను తెరచుకొంటూ, భూతకాల తిమిరాలలోకి నన్ను లాగుకొని పోతున్నవి నా జ్ఞాపకాలు. నేను మద్రాసులో ఆర్థికమంత్రిని, 1947 ఆగష్టు 14 రాత్రంతా ఆనందకోలాహలాలు, స్వరాజ్యం వచ్చిన దినము మనము ఆడుతాము, పాడుతాము అనే మహాకవి సుబ్రహ్మణ్య భారతి పాటలు. బ్రిటిష్ పతాక అవరోహణ, భారత పతాక ఆరోహణలతో ఆ రాత్రి దేహమంతా పులకితమైనది. కర్ణాలలో కోలాహల మధుర గీతాలు, ఆనంద బాష్ప భరితమైన నయనాలు, ఉత్సాహాన్ని ఉబికించే దృశ్యాలు మన పురాణాలు ఊహింపలేక పోయాయి. అపూర్వమైన పర్వదినము మన భారతావనికి. ముందు ఎన్నడు జరుపని సంక్రాంతి పెద్దపండుగ. చరిత్రకు తెలియని విజయదశమి. చిన్న చిన్న రాజ్యాలుగ, పరదేశీయుల పాదాలక్రింద నలిగిన ప్రదేశాలుగ ఉండిన పుణ్య మాతృభూమి పరిపాలన పట్టుల వదలించుకొని, మన ప్రజల చేతులలోనికి వచ్చిన విప్లవాత్మక వీరదినము కాక మరేమగును? ఎందరు దేశభక్తుల కలలపంట, త్యాగాల ఫలితం ఈ నిశాంత అరుణోదయము! దాస్యతిమిరాలు మాసిపోయి, ప్రభాత ప్రభాసల చూపుచున్నది. ఎంతమంది అజ్ఞాతవీరుల దీక్షా వీచికలు, ఎంతమంది మాతల మౌన ఆశీర్వాదముల అశ్రు మౌక్తికములచే పూర్ణములు ఈనాటి హర్షతరంగాలు. ఆనంద పారావారమే పొంగి పొరలినది. పూర్వకవులు ఈ దినమునకు సుప్రభాత గానముల పాడి మేల్కొల్పిరా! భావిద్రష్టలగు ఋషులు, ఈ భాస్కరునికి శత నమస్కారాలుచేసి పునీతులైరా? శ్రీరామచంద్రుడు విజయుడై సతీసమేతముగ సాకేతపురము

నకు విచ్చేసిన దినము దీనికి సరితూగగలదా? పురాణాలు కల్పన చేయలేని దినము, కావ్యాలు నుతించని దినము గదా యీ దినము. ప్రభవ విభవల ఉగాది కాదే ఇది. శతశతమాసాల దాస్య శృంఖలాలు తెగిపోయిన యుగాది నేడు.

గాంధీజీ ఐదు సత్యాగ్రహోద్యమములద్వారా సత్య అహింస సిద్ధాంతాల మీద, ఉపవాస మౌనవ్రతములచే, మట్టినుండి ఉత్తేజమును, ఉప్పునుండి స్వరాజ్య చైతన్యమును, పల్లవింపచేసిన పరిణామమిది. సహాయ నిరాకరణ, శాసనోల్లంఘన వీరనినాదాల మంగళనాద మిది.

బ్రిటీష్ పాలకులు సురక్షితముగ స్వదేశమునకు తిరోగమించిరి. సర్దార్ వల్లభాయి పటేలు ధృఢ సంకల్ప కార్యాచరణ, సంస్థానాధీశ్వరుల స్మరణపేటికలలో దాచబడిన దినమునకు నాందీవచనము పలికిన దినము. జమీందారులు గతకాల గహ్వరాలలో అదృశ్యమైనారు. పంచవర్ష ప్రణాళికల ద్వారా దేశ దైన్యమును బాప, వైజ్ఞానిక ఆధునికతా ద్వారముల తెరచి. నవీన పంథాల నడిపించిరి ప్రధాని నెహ్రూ.

దేశము మనదైనది. దీని పాలకులము మనము. దీని భవిష్యత్తు మంచి చెడ్డలకు మనమే పూర్ణబాధ్యత వహించాలి.

స్వరాజ్యపాలనా యుగములో దేశము ప్రజాహితకరముగ మంగళకరముగ శక్తిని గడించి, శాంతి మార్గమున వికసిస్తూ నడువగలదని నమ్మకము.

ఆగష్టు 1987,

నెల్లూరు.

## 2

# పుస్తకాల మధ్య

**పు**స్తకాల గదిలో ఉదాసీనముగ కూర్చుని పుస్తకాలు చూస్తూ ఉండినాను. ఉదయాన మంచు దట్టముగ క్రమ్మి యున్నది. ప్రొద్దు ఎక్కిన తర్వాత మబ్బులు మబ్బులుగ ఉన్నది ఆ ఉదయము. ప్రొద్దుపోక పుస్తకాలచెంతన చేరినాను.

రకరకాల పుస్తకాలు. కొన్ని సంస్కృత పుస్తకాలు. ప్రాచీన ఋషులు తపముచే ఎరుక కలవారై పరిణామము అక్షర రూపముగ కాన్పించుచున్నదా! శతాబ్దాల తరంగాలను దాటుకొంటూ, అలల తాకిడికి చెక్కుచెదరక, పురాతన సంస్కృతిని మేల్కొల్పే కావ్యాలు. భావావేశముతో కవులు రచింప, తరతరాలుగ పెద్దలు పిన్నలు వల్లించే పద్యాల పురాణాలు. భారతీయ సభ్యతను ప్రపంచానికి చాటిన నాటకాలు. ఏనాటివో ఎచ్చట వ్రాశారో, రచయితల జీవిత విశేషాలేమో మనకు తెలియవు. కాలయవనిక మరుగున శాశ్వతముగ అదృశ్యమైనవి వారి వివరాలు. వారి కృతులుగ, అదేహ కవుల రూపులుగ లభ్యమైనవి ఈ గ్రంథాలు. భారత సాహిత్యానికి మూల సంపదలై, ప్రయాణ కరదీపికలై, ఔత్సాహిక ప్రేరకములై, శాసించే

ప్రభు ఆజ్ఞలై మనదగ్గర చేరినవి. మనము విన్నా వినకున్నా, మానినా మానకున్నా, మౌనఆజ్ఞల చేస్తూవచ్చి మనకు వారసత్వ సంపదగ లభించినవి. ఎన్ని జ్ఞాన ధనరాసులకు వారసులము మనము! వారసత్వము పెద్దది, మిగిల్చుకొన్నది చిన్నది. ఇట్టి ఆలోచనల ఊపులు ఏమీ తోచని ఆ ఉదయాన, ముందుకు వెను కకు లాగుచుండినవి. ఆ తలపుల గుంపులమధ్య నాటకాంత ఉదాసీనమును నింపుకొనుచు, కాలమును గడిపాను, బయట ఆకాశాన్ని క్రమ్మిన మబ్బులే నా హృదయ గగనాన్ని ఆవ రించినవా అనిపించింది.

మరొక వైపున ఆధునికమైన ఇంగ్లీషు పుస్తకాలు, భిన్న విషయాలపై నున్నవి. ఇటీవల పరిశోధనల వల్ల ప్రకృతి గర్భంలో అణగివుండి వెలికివచ్చిన విజ్ఞాన కిరణాలు. భవిష్యత్తు వైపు నడిపించే వెలుగులు. ఇటీవలి దశాబ్దాలలో, అనేక ప్రయోగ శాలలలో కనుగొనబడిన నైసర్గికరహస్యాల మర్మాల విడతీసిన గ్రంథాలు. దీర్ఘకాలముగ నిద్రాణములుగనున్న రాగిణుల మేల్కొలిపిన మురళీరవాలు.

చదవని పుస్తకాలే మెండు, చదివినవి కొద్ది. చదవాలను కొన్నవి జాస్తి. చదవలేనివికూడ ఎక్కువగనే ఉన్నవి. చదవని పుస్తకాలు మూయబడిన కిటికీలు, ఎన్నటికీ తెరవవేమో! ఇన్నాళ్ళు చదవని పుస్తకాలను ముందు చదవగలనని ఆశలేదు. నాకు 80 సంవత్సరములు దాటినవి. ఇతర ఆకర్షణలు మరొకవైపుకు లాగుచున్నవి ఎంత చదివినానో, ఎంత జీర్ణించుకొన్నానో, ఎంత వినియోగించుకొన్నానో అంతకే తృప్తి. రాలని పండ్లకు ఆశించిన లాభమేమి? చేతికి అందిన పండునే సరిగతిని ఆనంద పడుట మేలుగదా.

ఈ వయస్సులో నాకు తెలిసినది పరిమితము. తెలియనిది అపారము. జ్ఞాన సముద్రములో ఒకమూల స్నానమాడు

చన్నాను. అన్ని వైపులా నన్ను తాకని జలవీచికలే. నందన వనములో ఒక పువ్వును కోసి చేతిలో అమర్చుకొన్నాను. మిగ తవి ఎన్ని రకాల పువ్వులు! వానిని దూరమునుండే చూస్తు న్నాను. అవి ఎగతాళిగ చూస్తున్నాయి నన్ను. నేను చేయ గలిగినదేమి? ఇట్టి అవహేళనా సరసాలతో సాగింది నా ప్రణయ యాత్ర పుస్తకాలతో.

తంబూరాతీగెలు శ్రుతిని మార్చాయి. ఈ పాతకాలపు పుస్తకాలు నన్ను వెనుకకు లాగేవా, ముందుకు నడిపించేవా అనే వేదాంతములో పడ్డాను. చదివి వల్లించే వారిని చాలా మందిని చూచాను. పాత ధ్వనుల కొత్త ప్రతిధ్వనుల వలె కనిపిస్తారు. అంతా చేబదులు వ్యాపారమే. స్వయం ప్రతిభావ్యుత్పత్తుల మొగ్గలు విచ్చకనే పోయాయి. సొంత సుగంధాలు వ్యాపింపకనే నిలిచిపోయాయి. పండితులే, గురువులే, ప్రోత్సహించేవారే. లోని మైకాను పైకి తేలేని మైకాగనులే. ముందుచూపు మందం. వెనుకచూపు అధికం. ఈ శతాబ్దపు ధోరణులను ప్రశంసించలేరు. పాతను పొగడుతూ కూర్చుంటే సరిపోతుందా? సాంప్రదాయపు మెట్లు గతకాలాల అడుగులకు చేరుస్తాయి. భావి శిఖరాలకు ఎక్కించేవి కావు. మనపెద్దలు నడిచిన కాలిబాటలలో నడుస్తూ పోవడం తేలికపని క్రొత్త మాగాణములలో కాలిబాటలు లేవు అడుగు జాడలు లేవు. ఎక్కిపోయే మెట్లు లేవు. భవిష్యత్తు ఉదయించపోయేది. చీకట్లు పలచబడుతూ వస్తాయి. అట్టి ఉద యించపోయే సూర్యునికే స్వాగతం పలుకుదాము. చీకట్లను దట్టముచేస్తూపోయే అస్తమించే సూర్యుని ఎంతకాలము పూజి స్తాము? పాతమట్టికి క్రొత్త ఎరువులువేసి, రకరకాల పువ్వులను, తీపితీపి పండ్లను యిచ్చే మొక్కలనే నాటుదాము.

భావి నిర్మాణము తేలికపని కాదు. బుద్ధిని ఉపయోగించి,

శ్రమకోర్చి బాటలు వేసుకోవాలి. ఓపికతోనే పనులుచేసుకోవాలి. ప్రమాదాలు ఎదుర్కొంటాయి. స్వార్థాలు ఎదురుదెబ్బ తీస్తాయి. వడగాలులువీస్తాయి. కారుమబ్బులు క్రమ్ముతాయి. నిరుత్సాహానికి లోనుగాక ముందుకునడవాలి. అప్పుడే క్రొత్త తలుపులు తెరుస్తాయి. క్రొత్త గాలులు స్వాగతం పలుకుతాయి.

మనము ప్రతిరూపులుగ, ప్రతిబింబాలుగ, ప్రతిధ్వనులుగ కాక, ప్రగతిపథములో మనదైన సొంతగొంతుకతో పలుకుదాము. నడుస్తాము. కాళ్ళది ముందడుగే. కళ్లది ముందుచూపే. అట్టి యాత్రనే సాగిస్తాము. పద అంటున్నది భవిష్యత్తు సంగీతము. పని సరిగనే మేళవిస్తాము.

అట్టి ఊహల వేదాంతముతో స్వప్న సంగీతముతో పుస్తకాల మధ్యనుండి బయటి వరండా వెలుగులోనికి వచ్చాను. మబ్బులు తొలగి, ఎండ కొంతమత్తుతో కాస్తూ ఉండినది. క్రొత్త గాలిని పీలుస్తూ నిలబడ్డాను. వీధిలో పనులవరదవలె రాకపోకలు మెండుగా సాగుచున్నాయి.

25-3-88,

నెల్లూరు.

# విజయ యాత్ర

సత్యాగ్రహం దండు కాదది
విజయవాహిని బయలుదేరింది
కాంగ్రెస్ శతాబ్ది ఇందిరా భవనమునుండి
నెల్లూరు దండికి - మైపాడు తీరానికి.
అనాటి తప్పు ఈనాటి హక్కుగ వెలసింది,
దేశపరిరక్షణ పతాకమై ఎగిరింది శాసనోల్లంఘనము
అనుభవాల భుజించి, చరిత్ర నెమరువేసింది.
సింహము మెడను త్రిప్పి, వచ్చిన త్రోవను చూచింది
గెలుపుల మిట్టలను, ఓటముల పల్లాలనుచూచింది
ఉప్పు పండించిన పద్దెనిమది ఏడులలోనే
దేశము స్వరాజ్యచీరతో శోభిల్లింది.
ఉప్పునుండే స్వరాజ్యము, ఏకుండే స్వతంత్రము
పుష్పించి, వనాన్ని హర్ష పులకితము చేసింది
విజయోత్సాహముతో ఆనందనృత్యాన్ని సల్పింది.
వసంతము పువ్వులతోపాడింది. కూజితములతో నవ్వింది

వనపాలుని మరణవార్త వచ్చింది
జాతిపిత, స్వరాజ్యసంధాత, సత్యాగ్రహ సేనాని
హే రాం అంటూ అసువులబాసిన దుర్వార్త ప్రాకింది
పిడుగువలెనే పడింది, శాపమువలె తగిలింది
తెప్పరిల్లి నెహ్రూ నాయకత్వాన దేశము నడిచింది
విభజన రక్తసిక్త పాదములతోనే నడిచింది
సామ్యవాదపథాన, విశ్వశాంతి వినువీథులలో
ఎగురుచు ఎదిగింది
సర్దార్‌పటేల్ ధృఢసంకల్పమున
సంస్థానాలు జమీందారీలు,ఆరిన నిప్పుగ మారారు
గణతంత్రరాజ్యమున ప్రజలే హక్కుదారులైనారు
పంచవర్ష ప్రణాళికలతో, దేశము రెక్కల విప్పి
ప్రగతి మార్గాన, విజ్ఞానదండమును చేబూని
ఆధునికతా ద్వారాల తెరచుకొంటూ సాగింది
ప్రాచీన మిథ్యాస్వప్నాల కాలం తీరింది
స్వరాజ్య ప్రాప్తి సుధను చవిచూస్తున్నాము
నాలుగుదశాబ్దాల సూర్యోదయదిగంతాలు
నాటివలెనే నేడును దూరముగనే కన్పిస్తున్నాయి
సమస్యల మృణాళము దీర్ఘముగ దారిద్ర్యకాసారమున
దాగి ప్రగతిపుండరీకమును కలతపెట్టుచున్నది
చిక్కుల విడదీయుటకు విజయవాహిని బయలుదేరింది
1930లో లేని పాదయాత్ర, దండిని స్మరిస్తూ
1988లో సాగింది. యువకులు దీక్షతో నడిచారు.
గ్రామాలు స్వాగతం పలికాయి
హారతుల నిచ్చాయి.
నివురులో తూగుచున్న నిప్పు మేల్కొన్నది

అగ్నికి మండే అవకాశము కావాలి
గాలి తోడు లేనిదే నిప్పు రగులుకోలేదు
పువ్వు వాసనలు నలుదిక్కులా కొట్టదు
ప్రాణము నిలువదు
కలకే ప్రాణము వచ్చిందాయని తోచింది
వర్తమానము భూతకాల గవాక్షములు తెరచిందా?
నేటి ఆకాశమున, నాటి హరివిల్లుల వన్నెలు గోచరించాయా?
అన్నట్లు, పాత జ్ఞాపకాల సన్న రేఖలు వెలుగును పొందాయి

## 2

సాయంత్రము వైభవ సమావేశము
హారతులతో పాదయాత్రల సమాప్తి
స్మారకస్తూపము ఆవిష్కరించారు
తొలిజట్టు దళాధిపతిగ నన్ను సత్కరించారు
ఉప్పు పరిశ్రమల మంత్రి వెంగళరావు.
చివరన నా సమాధానము చెప్పాను.
ఆనాటి లేత మొక్క, 58 సంవత్సరాల పిదప
పెక్కు గ్రీష్మముల, శిశిరముల చవిచూచి
వర్షములలో తడిసి, వసంతములలో నవ్వుచు
ముసలి పూలచెట్టుగ కనబడుచున్నానా?
అభిమన్యుడు భీష్మాచార్యుడై ఉత్తరాయణమునకై
దారితెన్నుల నిరీక్షించుచున్నాడా?
అనుభవాల సానరాతిపై పదునెక్కిన కరవాలమురీతి
చెదరక నిలిచియున్న సంకేతాన్ని నేను,
సత్యాగ్రహాలు మిగిల్చుకొన్న చేతి జండానునేను.
వ్యక్తిగతముగ నాకు సన్మానముకాదు.

కాలపు సుడిగుండాలలో అసువులు బాసిన
వీరసైనికుల, త్యాగధనుల ప్రాతినిధ్యము వహించిన వాడిని
వారి తరపున సత్కారము స్వీకరించినాను.

## 3

స్వర్గవాసులైన అమర షహీదులందరు
అదృశ్యహస్తాలతో అక్షతలు చల్లారు.
ఆనంద హృదయ కమలాలను క్రుమ్మరించారు.
ఈ పారితోషికాన్ని శతాబ్ది ఇందిరాభవనములోనే ఉంచండి.
భావిని ప్రేరేపిస్తూ, భూతకాలము వర్తమానమునకిచ్చిన దక్షిణ.
నాకు సన్మానమెందులకు ?
ఉప్పును పండించి నేను నష్టపడలేదు,
పదవుల లాభాలనే పొందాను
1930లో ఉప్పుసత్యాగ్రహము చేశాను.
1937లో అవిభక్త మద్రాసులో మంత్రినైనాను.
మంత్రినికాగ, తెల్లదొరలే సన్మానించారు.
నా క్రింది అధికారులు దొరలే
నా ఆజ్ఞల శిరసావహించారు.
శాసనోల్లంఘి శాసనకర్తయైనాడు
ఉప్పుమంత్రము మంత్రిని చేసింది
కాలచక్రము తిరిగింది.
మరలా స్వరాజ్య పోరాటము సాగింది
మంత్రులు ఖైదీలయ్యారు
ప్రపంచయుద్ధము ముగిసింది, స్వరాజ్య సమరము సమాప్తి చెందింది
స్వరాజ్యానికి ముందే తిరుగ మంత్రులయ్యారు.

రాష్ట్రాలలోనేకాదు, కేంద్రంలోను మంత్రులయ్యారు.
రాజ్యాంగచట్ట సభ 46 డిసంబరులో కూడింది
47 ఆగష్టుకు స్వరాజ్యము వచ్చింది
52 జనవరికి రిపబ్లిక్ అయ్యింది
రాజులు ప్రజలే, జార్జులు, ఎడ్వర్డులు కారు.
స్వరాజ్య పోరాట ప్రయాణము
మిట్టపల్లాలలో సాగింది.
నా 80వ యేట, 40 యేడులు స్వరాజ్యకలల కన్నాను
40 యేడులు స్వరాజ్యసిద్ధిని చూచాను
నేటి యువతరము. యింకొక 40 యేడుల అభివృద్ధిని చూస్తారు
ప్రజాస్వామికము, ఐక్యత
స్థిరముగ ఉండాలి
అదే నేటి నా స్వప్నము, ఆకాంక్ష
మన అందరివాంఛ, దీక్ష.

18-4-87,

నెల్లూరు.

# మురికి గుంటలు

మీకు మురికిగుంటలే కన్పిస్తున్నాయా
జలదారుల దుర్గంధాలనే పీలుస్తున్నారా
అంతకన్న మంచిదేదీ చూడజాలరా
అలవాటుపడిన కన్నుల, ముక్కుల
మరల్చుట కష్టమే.
నేను తుహినగిరిజ
గంగానదిని చూస్తున్నాను,
అశేష జనానికి విశేష సంపదల
నిస్తున్న గంగనే చూస్తున్నాను.
ప్రజాశక్తి త్యాగనిరతి దేశభక్తి
మొలకల మొలిపించి
స్వరాజ్య పంటల పండించిన
గంగా ప్రవాహపు గెలుపునవ్వులు
వినిపించుట లేదా?
ప్రగతి తరంగాల రవళులతో పారే
దీక్షాస్రవంతి మీకు కనుమరుగా?
రేకులు రాలి వాడిన కమలమునే చూస్తారా?

దాగి తలపై తాల్చిన తామరతూడును
మీరు చూడతలచలేదు గదా!

బిడ్డ తప్పుకు తల్లిని తిట్టుటయా?
మీకు కాన్పించేది బిడ్డ తులుపి పనులే.
కారుణ్యమును చిందే తల్లికాళ్ళనే నేను ఆరాధిస్తాను
స్వతంత్ర పతాకమును నా చేతికి అందించినదెవరు?
చరిత్ర చూడని మౌన వీరానలమును రగుల్కొలిపినదెవరు?
అహింసా పిలుపులతో త్యాగవిందులకు పిలిచిందెవరు
ఇంతలోనే మరపా!
నిచ్చెన ఎక్కి, పై మెట్టులచేరి, పదవులపొంది
నిచ్చెనను తన్నివేయుచున్నారా
నిచ్చెన మీకు దొరకనంతవరకు
మీరు ఎవరో, ఎవరికైన తెలుసా
ఏ సేవలుచేశారు, ఏ ప్రసిద్ధిని గడించారు
పదవుల పొంది ప్రసిద్ధికి వచ్చారు
ధూమకేతువులవలె ఆకసమును క్రమ్ముచున్నారు
దేశమంతా పర్విడుచున్నారు
నిచ్చెనను తన్నినకాళ్ళు, నిచ్చెన ఎక్కిన కాళ్ళే
పాలుత్రాగి, తల్లిరొమ్మును చీలుస్తున్నారు
కృతజ్ఞతను తెలుపవలసిన పెదవులు
కృతఘ్నతతో ఎండి, మాడిపోతున్నాయి
కళ్ళు మురికి గుంటలనే చూస్తున్నాయి.

17-6-88,

నెల్లూరు.

# పెద్దవారగుచున్నారే

ఏమమ్మా, మీరూ పెద్దవారగుచున్నారే
మనుమరాలికి పాప పుట్టింది. ముత్తవ్వనయ్యాను.
ముత్తవ్వలు ముసలివారు కాక ఎట్లా ఉంటారు ?
మీకూ ముసలితనపు ముడతకంబళ్ళ
స్వాగతాలు తప్పవా ? మాకే అనుకొన్నాను
మీరూ ఈ పటాలములోనే చేరారా

ఒకనాడు శిశిరము ఎరుగని నిత్య వసంతమని
మచ్చలేని రాకా సుధాకర బింబమని
గ్రహణముపట్టని అర్క తేజమనుకొన్నాను
వినూత్న యౌవన సౌందర్యాలు మీ సంపదయని
జ్యోత్స్నవీచికలలో విహరించే చకోరమని
మంచుపట్టని ప్రభాత ప్రభయని ఊహించాను.
కాని నా తలపులు చెదరిపోయినవి
ఉదయ పక్షిసమూహము రీతి.
మీ ప్రత్యేకత విశిష్టత ఎటుల మాయమాయెను ?
జరాభారముల నెరుగని దేవతనుకానే అందరివంటి దానవే,

ప్రత్యేకతల మంత్రమహిమలు లేవే! పరిమితమైన మానవజీవితములో, స్వల్ప ఆయుస్సులో ఎన్ని వేషాల మార్పులు. అనుదినము పెరుగుతుంది, కొద్దికాలానికి బలహీనత చెందుతుంది.

వెంట్రుకలు తెల్లబడుట, దంతములు సడలుట,
ఊడిపోవుట, చూపు వినికిడి మందగించుట అందరికీ తెలిసినవే!
ప్రయాణానికి సామానులు ముందుగనే స్టేషన్‌కు వంపుతాము.

అన్ని అవస్థల జపమాల త్రిప్పుకొంటూ, రోగతోరణాల
సింహద్వారము వైపునకు జీవితము సాగుతూ ఉంటుంది.

కాలవాహిని వీచికలు తోస్తూనేయున్నవి.

మారుచుండే రుతువుల వయ్యారాలను తిలకిస్తూ
ముందుకు సాగుతుంటాము.
మీకు తెలియనిది నేనేమి చెప్పగలను?
మీరు తలచినది కల్పనలు, వాస్తవాలు కావు.
ఎండమావుల వేటలో, శ్రమ చెమటలే మిగిలేది
మీ కల్పనల దేవతను కాను
ముసలిదాన నయ్యాను.
ముత్తవ్వనై, మునిమనమరాలును
జోకొట్టుచున్నాను.
మీవలెనే, వయస్సుమళ్లిన అందరివలెనే
కాలపు అవ్వ, ముడతల కంబళి కప్పుతుంది
మరణకావ్యానికి ముందుమాటలు వ్రాస్తుంది.

8-7-88,

మద్రాసు.

# నిలకడ - కదలిక

1. చెట్టు నిలిచేయున్నది.
   నీడలు పొడవగుతూ మాయమైనాయి.

2. ఆల్‌బంలో బొమ్మ అట్లానే యున్నది.
   అసలు మనిషి ముదిమి అంగీని తొడిగాడు.

3. ఆకసము అట్లనే యున్నది.
   మబ్బులు మెరుస్తూ గర్జించి వెడలిపోయాయి.

4. సూర్యచంద్రులు స్థిరముగనే ఉన్నారు.
   రాహుకేతువులు ముఖాల బురదచల్లి మాయమైనారు.

5. కొడుకులు ఊరిలోనే నిలిచారు.
   కూతుళ్ళు అత్తల ఊర్లకు చనినారు.

6. చావు అట్లనే చుట్టుకొనేయున్నది.
   బ్రతుకు వచ్చింది, పెరిగింది, కాటిని చేరింది.

7. తోట అట్లనే ఉన్నది.
   ఆమని వచ్చింది, నవ్వింది, పాడి పలాయనమైనది.

8. విశ్వవిద్యాలయాల సిబ్బంది పదిలముగనే ఉన్నారు.
వైసుఛాన్సలర్లు వచ్చి అదిరించి బెదిరించి వెళ్ళారు.

9. మనిషి అట్లనే మనుగడ సాగిస్తున్నాడు
యౌవనము వచ్చింది, ఎగిరింది, ముదిమి మూలదాగింది.

10. కాంగ్రెసు నూరేళ్ళచరిత్రతో దేశమంతా వ్యాపించే యున్నది.
వివిధ పార్టీలు నినాదాలు చేశాయి, చరిత్ర చీకట్లలో కలిసిపోయాయి.

11. సంస్కృతము స్థిరముగ నిలిచియున్నది,
దేశభాషలు మారుచు పెరుగుచు జన కుటీరాలకు ప్రాకుచున్నాయి.

12. సూర్యుడు మామూలుగానే ఉదయిస్తున్నాడు, క్రుంకుచున్నాడు.
గ్రహాలు తిమిర విహారాలు చేస్తూ, పర్దాలో దాగుతూ నృత్యము చేస్తున్నాయి.

13. ఉపాధ్యాయులు నౌకరి చేస్తూనే ఉన్నారు
విద్యార్థులు వచ్చి, డిగ్రీలుపొంది, పెద్ద ఉద్యోగాలను అలంకరిస్తున్నారు.

14. అప్పకవి క్రిందపడి దొర్లుచున్నాడు.
శూద్రులు కావ్యాలు వ్రాసి, గౌరవాలు పొందుచున్నారు.

15. దేశవిస్తీర్ణత ఆలాగే ఉన్నది.
జనాబా రెట్టింపుల దాటి పెరుగుచునే యున్నది.

16. పౌర్ణమి అమావాశ్యలు అట్లనే యున్నవి.
చంద్రుడు ఉబ్బుచు, తగ్గుతు వివిధవేషాలు వేస్తున్నాడు.

17. గోదావరి అట్లనే ఉన్నది.
నీళ్ళుమాత్రము రేయియనక, పగలనక పారుచునే
యున్నవి.

18. శిరము ఎప్పటివలెనే ఉన్నది.
కేశములు భిన్న అలంకారములతో నగలతో శోభిల్లు
చున్నవి.

19. దేహలత అట్లనే రాణించుచున్నది.
చీరలు రవికెలు రంగురంగులతో నవ్వులు నవ్వుచున్నవి.

20. పాటకచ్చేరి జరుగుచునే యున్నది.
రాగాలు, స్వరాలు, తాళాలు వచ్చి వెడలుచున్నవి.

10-7-88,

నెల్లూరు.

# 7

# ప్రత్యామ్నాయాలు

ప్రభుత్వాలకు
ప్రత్యామ్నాయ ప్రభుత్వాలకై
వెదకుటలో వింతలేదు.
అదే ప్రజాస్వామిక విజయము.
కాంగ్రెసుకు
ప్రత్యామ్నాయ పార్టీల ఐక్యతకై
యత్నించుచున్నాడు రామారావు.
కేంద్రప్రభుత్వము మిధ్య అంటూనేయున్నాడు.
తెలుగుదేశపు ప్రభుత్వానికి
ప్రత్యామ్నాయ విజయాలకై
యత్నించుచున్నారు చాలామంది రావులు.
మొదటిది సరియైతే
రెండవది సరియైనదే,
రెండూ ఒప్పులే, కుట్రలుకావు
రెండూ నిలుపుకోవాలనే కోర్తాయి,
ప్రజాస్వామిక ప్రభుత్వాలకు
యువరాజులులేరు, వారసులులేరు.

ప్రజలే ఎన్నుకొంటారు.

కేంద్రప్రభుత్వము పరాయిదికాదు.

దిగుమతి యైనది కాదు.

రాష్ట్ర ప్రభుత్వాన్ని ఎన్నుకొనేవారే

దేశమంతా కేంద్రప్రభుత్వాన్ని ఎన్నుకొంటారు

ఒకటి మనది, మరొకటి పరాయిదికాదు.

రెండూ మనవే.

ఎవరి పరిధిలో వారు నిర్వహించాలి.

గురుశుక్రులు సూర్యునిచుట్టూ తిరిగినయట్లే

గ్రహాలు అనలేవు సూర్యునిచుట్టూ

మేము ఎందుకు తిరుగుచుండాలని,

అంటే వాని పతనమే.



23-7-88,





నెల్లూరు.

8

# దూరపు తారలు

ధరణికి అతిదూరములోనున్న తారలు
చాల సమీపములోనున్న పూర్ణిమచంద్రుడు
రాత్రంతా కిలకిల నవ్వుచు ఎగురుచుండినవి.
కాని హృదయతంత్రులలో భీతిస్వరము దాగే ఉండినది
భయ కంపితములై స్థిరత్వము కోల్పోవు చుండినవి
ప్రభాత ప్రమాదము చేరువనే ఉన్నదను సంకోచము
ఉదయభానుడు కరవాలముతో సంహరించునని భీతి
సూర్యజననము తమ సమాధి శయనమని విహ్వలత
రవికిరణములే మరణ సందేశ దూతలని ఆందోళన
తూర్పు జననము పడమటి పతనము.
నవ్వుల వెలుగులలోనే చావునీడల చీకట్లు
తారల మరణ భీతులు సూర్యుని కారుణ్యతంత్రుల మీటవు.
కన్నీటి మంచుచుక్కల కారుస్తూ, కాంతి తల్లి ఒడిలో కూలి పోతాయి.

30-7-88,
నెల్లూరు.

# ఏ పార్టీ?

ఏమండి, మీది ఏ పార్టి
కాంగ్రెసులోనే ఉన్నారా?
అని అడిగింది తెలుగుదేశపు భక్తురాలు
నన్ను, మీరు అడగవలసిన ప్రశ్నకాదే
బాల్యమునుండి కాంగ్రెసువాదినే
గెలుపు ఓటములలో కాంగ్రెసులోనే ఉంటాను.

క్షమించండి అడిగినందులకు

ఫర్వాలేదు, మీరు ఏమి అపచారము చేశారు క్షమించేందులకు?
వర్తమాన వేషాల రంగుల తారుమారుల చూస్తూ
నా విషయమై మీకు అనుమానమేసింది.

గాంధి, నెహ్రూల వదలి
ఎవరి మందస్మిత తృప్తికొరకు, అభయహస్తాల కొరకు
మారాలె యీ వయస్సులో.
వ్యక్తులతో సంబంధములేని
ఉద్యమాల, లక్ష్యాలతోనే బంధమునాది.
నేను కోరేది, వారు ఇచ్చేది ఏమీ లేదు
అని అన్నాను, నవ్వుకొన్నాము.

# వారకాంతలు

వారపత్రికలు మనకు తెలిసినవే
వార కాంతలలోని వారశబ్దముకు అర్థమేమి ?
పండితుల కొందరిని ప్రశ్నించి, పరీక్షించాను
ఊహాగానాలు చేశారేగాని సమాధానము సరిగలేదు.
ఒక స్నేహితుడు, ఇంటికిపోయి
నిఘంటువును చూచి ఫోను చేశాడు
సమూహమని, సరిగా ఉన్నదనుకొన్నాను.
అర్థము తెలియకనే
అలవాటైన మాటలను వాడుచుంటాము.

2-8-88,

నెల్లూరు.

# గోపీజన వల్లభ

కృష్ణా, గోపీజన వల్లభా
నీవు ప్రేమించే సుందరి అంత
అందముగ మేము లేకపోవచ్చును.
ఆ అరవిందవదనము, ఆ గౌరవర్ణము
మాకు కొరబడి యుండవచ్చును
అట్లని, యువతులమగు మమ్మ ఏమి చేయమంటావు?
ఏ తపస్సు ఆచరించమంటావు?
కామ దహనములో సమిధలవలె కాలి మసి కావలయునా
ప్రేమాగ్నిని రగుల్కొల్పిన నీవే సమాధానము చెప్పాలి
అని అడిగింది, ఒక సాహసిక అభిసారిక.

2

# ప్రొద్దున్నే నడవడం

మీరందరు ప్రొద్దున్నే నడవడం చూస్తున్నాను
నన్నూ నడవమంటారా అని అడిగాను
రహదారి, అడ్డు ఎవరు పెడ్తారు అన్నది ఒకమందహాస
మీరు ముందు నడవండి
మిమ్ము అనుసరిస్తూ మేము నడుస్తాము.
అన్నది యింకొక చపలాక్షి
అట్లయితే, నేను మిమ్ము చూడలేనుగదా!
అన్నాను కొంటెగా నవ్వుతూ
మేము ముందు నడుస్తాము
వెనుక మీరు నడవండి అన్నది చలితాలక కపోల
అప్పుడూ మీ ముఖముల చూడలేను గదా అన్నాను సరసంగా
మా స్వేద ముఖాల చూస్తూ
నడవాలని యిష్టమా అన్నది ఒక గడుసరి జవరాలు
చిక్కని సమస్యే తెచ్చిపెట్టారే అన్నది నవ్వుతూ ఒక చతురభాషిణి
వీథి తూర్పుకొననుండి మీరు నడవండి
పడమటి కొననుండి నేను నడుస్తాను
మధ్యలో కలుస్తుంటాము గదా అన్నాను తెలివిగా.

చిక్కుముడి వీడింది, సమస్యకు సమాధానము దొరికింది
అప్పుడు మా నీడలలో మీరు నడవరు
మీ అడుగుజాడలలో మేము నడవము
ఎదురు ముఖముగాను చూస్తూ అందరము నడుస్తాము
అన్నది ఒక జనపద గజయాన.
ఈ రోడ్డుమీద సరస సంభాషణ ఏమిటండీ, మీ దారిని మీరుపోక
అంటూ బృందహాసము లాడుకుంటూ వెడలిపోయారు.
జీవితములో ఎన్నెన్ని వినోదాలు
ఎన్ని తమాషాలు !

4-8-90

నెల్లూరు.

# నేనొక్కడనే మాజీని

వేదికమీదివారు వర్తమానములో విహరించేవారే. నేను ఒక్కడనే మాజీని. స్మృతి విలాస మహిమలతో కాన్పించేది.

నాకు వర్తమానము శూన్యము. భవిష్యత్తు రహస్య సందేశములతో, రోగ సంకేతములతో ఆహ్వానించుచున్నది. కొందరికి భూతకాలము లేదు. అంతా భవిష్యత్తే. శుక్లవిదియ చంద్రునివలె వికసిస్తుంటారు.

కొందరికి నిత్యవసంత వర్తమానాలే వర్తమానము రిక్తమైనా, భూతకాలమున్నది కొందరికి. భవిష్యత్తులో కూడ అభివృద్ధిని చూపవచ్చు.

నేను ఒక్కడనే మాజీని
స్మృతి తరంగాల నౌకను నడిపే కర్ణధారిని
వర్తమానాన్ని తుడిచివేశాను
ఎరుకలేని భవిష్యత్తు గుసగుసల
వినుటయే నాకు మిగిలినది-ముందు ప్రయాణానికి దారిబత్తెముగ,
వర్తమాన విహంగములతోపాటు

ఒక మాజీని, ఈకలురాలిన పక్షిని కూడ
సన్మానించారు. కృతజ్ఞతలు.

16-8-88

తుర్లపాటి సభ.

నాకేమీ తెలియదు
ఎక్కడనుండి వచ్చానో
ఎక్కడికి పోవుచున్నానో
నా అజ్ఞానము ఎంతయైన గాఢే
ప్రపంచము తుది మొదలులేని పురాణము
నా అజ్ఞాన తిమిరాలతోనే
ప్రపంచపు వెలుగులను ప్రేమించుచున్నాను.
రహస్యబంధనాలను చుట్టుకొనుచున్నాను.
ప్రేమ ప్రదీపజ్యోతి అరినపుడే
అజ్ఞాత నగర కవాటాలు తెరచేడి
అచ్చట అజ్ఞానములేదు, రహస్యము లేదు
అంతా జ్ఞానమే, అంతా దీప్తి, అంతా శాంతే.

12-9-88

# అమ్మయైనా అడగందే పెట్టదు

అమ్మయైనా అడగందే పెట్టదు అనే లోకోక్తి
పిన్నల విషయములో సరిపోతుంది
పెద్దలకు పలు అడ్డుదారుల సూచిస్తుంది
ఇదే యాచనకు పునాది
భిక్షాందేహి అని అడిగిస్తుంది
ఇవ్వగలిగినవారే, భిక్షం పెడ్తారు
దానము చేస్తున్నామని తృప్తి పడతారు
పరీక్షలోనో, ఎన్నికలలోనో
నెగ్గించమని దేవుని అడుగుతాడు
మొక్కులు చెల్లిస్తామని తీర్మానించుకొంటాడు
తీర్థయాత్రలకు పోతాడు
ఏడుకొండలవానికై తలగొరిగించుకొంటాడు
దేవుడు కూడ అడగందే యివ్వడని నమ్మకము
దర్శనాలు, ప్రదక్షిణాలు చేసుకొంటూ
కోరికల వరుసల క్రుమ్మరిస్తాడు
కోరికలలో ఎన్ని తీర్చాడని బేరీజు వేసుకోడు
అడుగుదాము, ఇస్తే సంతోషము

ఇవ్వకున్నా మన ప్రారబ్ధం అనే ఓదార్పు.
రాయి విసురుతాము, పండురాలితే సంతోషము
రాలకుంటే, పోయింది రాయేగదా అని తలుస్తాడు
అడగడమే మనవంతు
పెట్టవలసినది అమ్మేగదా.
దేవుడైనా, అడగకుంటే ఎట్లా యిస్తాడు?
ఏది అవసరమో, తెలిసికోలేని అజ్ఞుడా దేవుడు.
ఇక పరిపాలనకు వస్తే
సిఫారసుల పరిపాలన
అర్హతగిర్హతనాస్తి, ప్రబలమైన సిఫారసుకావాలి.
అప్పుడే నౌకరి దొరికేది, పని అయ్యేది
నేరుగా అడుగలేకుంటే, అడిగింపించాలె
అదే సిఫారసు పైరవీ.
డబ్బుతో కాకపోతే సిఫారసుతో నడిపించాలి ఫైలును
సిపారసు గుర్రాలమీదే స్వారి చేస్తుంది ఫైలు
పెద్దపనికి పెద్ద సిఫారసు కావాలి
అందరూ సిఫారసు చేయించుకొంటారు
మనము ఊరుకుంటే ఎట్లా అనే మెట్ట వేదాంతము
ఉత్తరము వ్రాయకపోయినా
టెలిఫోనులో ఢిల్లీకో హైదరాబాదుకో మాట్లాడితే చాలు
అంటాడు పారిశ్రామిక నిపుణుడు.
తొందర పెట్టాలి, అల్లరి చెయ్యాలి
ఉద్యమాలు లేవదీయాలి, అవసరమైతే సమ్మె చేయాలి
అంటారు సామూహిక కార్మికులు, నౌకర్లు ఉద్యోగస్తులు.
అన్నిటికీ పునాది,
అడిగితేనే గాని పెట్టదు అమ్మైనా.

అవార్డులకు సిఫారసులు
సన్మానాలకు సిఫారసులు
ఎటుత్రిప్పినా, ఒత్తిడి చేయాలి
చెప్పించాలి, లేకుంటే పెద్దదే యివ్వాలి
పరిపాలనా యంత్రానికి చక్రము సిఫారసు
ఈ రీతిగ నడుస్తున్నది సమాజము
మేధావులు తీవ్రంగా ఆలోచించాలి
తెలివితేటలకు, అర్హతలకు ఉచితస్థానము రావాలి
న్యాయము నీతి వెలుగులు వెలగాలి
సిఫారసు చేయను, పట్టను
అనేవాడు డాక్టరు కట్టమంచి.
అట్టి ఆదర్శము కావాలి, కనీసము యత్నించాలి
చీటికి మాటికి చీటీలు యియ్యరాదనే ధైర్యం కావాలి
నిర్మొగమాటంగాన్నే, మెత్తగానే తెలియచెప్పాలి
అనాడే పరిపాలనా వాతావరణం
కాలుష్యరహిత మగుతుంది
సిఫారసు చాలా ప్రమాదాలకు పునాది
అన్నిటికీ ఆడ- అడగందే అమ్మ అయినా పెట్టదు
తస్మాత్ జాగ్రత్త, జాగ్రత్త

17-9-88

నెల్లూరు.

షియోల్ ఒలింపిక్స్ ఆరంభం.

# 5

# ముక్తకాలు

1. యామిని పుత్రిక
   కుమారి నీహారిక
   భానుప్రసాద్ రాగానే
   ఉదయాన్నే లేచిపోయింది.

2. అభిసారుడై వెడలిన చంద్రుడు
   మధ్యలోనే చిక్కుపడ్డాడు.
   సంకేతస్థానము చేరేలోపల
   సూర్యనారాయణ వెనుకనుంచి వెంటబడ్డాడు.

3. భారత పతాకము నాచేత నుండ
   తెలుగు పతాకము నాచేత
   లేకున్నా ప్రమాదము లేదు.
   ఆంధ్రపతాకము చేజూనిన వానికి
   హైదరాబాదు, విజయవాడల
   నగరపతాకలు చేచిక్కకపోయినా
   పరవాలేదు.

4. చాలామందిని చాలాకాలము తర్వాత
కలిశాను ఢిల్లీ నెహ్రూ స్మారకసభలో
నావలెనే అందరు కాలసర్ప దంష్ట్రిలే
ఏమిటో యీ సరదా కాలానికి
దాని తీవ్ర ఆసక్తి వికృతపరచుటయేనా
ఒంటి ముడతల కంబళ్ళను కప్పుటయేనా

5. యార్లగడ్డవారి అవార్డు
వావిలాల ప్రవరాఖ్యుని వరించింది.
చేతిలో కమ్యూనిస్టు పతాకము
గాంధేయ సిద్ధాంతముతో నడుస్తుంది.
సుస్వభావుడే, మితభాషికాడు,
ప్రతిచోట, తెలుగు తెలుగని ఆందోళన చేస్తాడు
శాంతివచనము కూడా ఆవేశముతోనే చెప్తాడు
భారతీయతకు విరోధముకాని
తెనుగుతనాన్ని చూపే పల్నాటి బ్రహ్మచారి.

6. నా కారాగార శిక్షలు,
ప్రభుత్వ పదవులు
భూతకాల పురిముడిచిన నెమళ్ళు.
నా అస్వస్థతలు, అనారోగ్యాల
వర్తమాన ముదిమివలలో తిరిగే మొసళ్ళ పిల్లలు
నా రచనలు కవితలు
భావికాల అక్షరాల పొదలలో కాన్పించే మిణుగురులు

7. సంకల్పాలు కిష్కింధాకాండము
విలాపాలు అయోధ్యాకాండము
సన్నాహాలు యుద్ధకాండము

పారాయణ సుందరకాండము
మిగిల్చుకొన్నది అరణ్యకాండము.

8. సమ్మతిస్తే వ్యభిచారము
సమ్మతించనిచో అత్యాచారము
ఏది కోర్తావో తేల్చుకో అన్నాడు.
తేల్చుకొన్నానంటూ, గూబ అదిరేటట్లు కొట్టింది.
ఆగ్రహ హాసాలతో వెడలుతూ ఉంటే
సరియైన గుణపాఠమే అని మెచ్చి నవ్వాను.
చిరునవ్వులతో గబగబా వెళ్ళి కారులో కూర్చున్నది.

3-5-88,

నెల్లూరు.

9. అనుసరించేవారు
వీపులనే చూస్తారు.
ముఖదీప్తులు, నయనజ్యోతులు
వీక్షించుటకు నోచుకొనలేదు.

10. చీకట్లో
దీపమును ముందు పట్టుకొంటే
నీవు కనబడతావు
నేను కనబడను.
దీపమును వెనుక పట్టుకొంటే
నేను కనబడతాను.

నీవు కనబడవు.
నీవు కనబడేటట్లే
ప్రేమ దీపమును పట్టుకొంటే మంచిదిగదా !

11. ఇచ్చే చేతుల కట్టేసి
పుచ్చుకొనే చేతులుగ మార్చితే
సత్కార్యమే. సన్మానమగుతుందా ?
పెట్టే అమ్మలను అట్లనే ఉంచుట మేలుగదా !

12. నేటి ఆకలి విన్నపాలకు
రేపటి విందు వాగ్దానాల ఔదార్యానికి
ఆకలిమంటల చల్లార్చి తృప్తినిస్తాయా
నేటి క్షామ బాధలను
వచ్చేయేటి వర్షవాగ్దానాలు
తీర్చివేసి సంతోషపెడ్తాయా !
భూలోక ఉపవాస వ్రతాలు
పారాయణ పట్టుదలలు
స్వర్గలోక పరిరంభణాలకేనా
వడ్డీతోకూడిన అసలా ?

13. కనురెప్పల కదలికలు
కన్నులకేకాదు, ముఖానికీ శోభనిస్తాయి..
కనుబొమల చిట్లింపులు.
భావావేశాన్నో, వికారాన్నో తెలిపేవే..

14. కమలా,
నీ నాట్య కౌశల్య చతురిమలను
చూచి, ఆత్మానందమును పొందాను..
నేటి నవనటీమణుల

నృత్యోత్సవాలను చూచి
హర్షింపలేక యున్నాను.
వారికి అపచారమే చేస్తున్నానేమో!
తప్పిదము నీదా నాదా ?

25-7-88,

నెల్లూరు.

15. ఉత్తరమునకు జీవము చేవ్రాలు
పుష్పమునకు జీవము పరిమళము
మేఘమునకు జీవము వర్షధార
వనమునకు జీవము వసంతము
గృహమునకు జీవము గృహిణి.

16. భవిష్యత్తు శూన్యముకాగా
వర్తమాన ప్రదీపములు ఆరిపోవ
భూతకాల స్మృతి పరంపరల పరిమళాలు
మూర్కొనుచు జీవితసంతుష్టిని పొందుచున్నాను.

17. కొందరికి భవిష్యత్తు లేదు.
కొందరికి భూతకాల వైభవాలు లేవు.
కొందరికి ఆమరణ వర్తమాన కాంతులే
ఎవరి తలవ్రాత వారిదే
తుడిచే చేతులు లేవు.

# వీపు

దేహములో ముఖ్యభాగమైనా, వీపును మనము చూడ లేము. దేహదుర్గమునకు కుడ్యము, ప్రాకారము వంటిది. ముఖా నికి శిరస్సుకు ఇచ్చిన ప్రాముఖ్యము వీపుకు మనము యియ్య లేదు. సాహిత్యములోను వీపు వర్ణన ఎవరూ చేయలేదేమో ! కటి ప్రదేశమని, నితంబములని సూచిస్తారు. వీపును ఎవరూ పేర్కొ నరు. దీనిని సంస్కృతములో ఏమంటారో కూడా నాకు తెలి యదు. మౌనంగా ప్రధానమైన పాత్రనే నిర్వహిస్తుంది.

యుద్ధ భూమిలో వీపును చూపుట పలాయన సూచన. గుండెమీద గుండుదెబ్బ తిన్నవాడు సాహసవంతుడు. వీపు మీద దెబ్బ తిన్నవాడు పిరికిపంద. వీపు పరాఙ్ముఖత్వమును సూచించేది. ఉదాసీనభావాన్ని చూపేది. కార్యరంగములో రొమ్మును యిచ్చి పనిచేయువాడే కార్యశూరుడు. వీపుతో ఏ పనీ కాదు. వీపుతో ముందుకు నడువలేము, చూడలేము. చిత్ర మైన పాత్ర వీపుది. ఇప్పుడిప్పుడే వీపును చూపే జాకెట్లు వస్తున్నాయి. వీపు అందం కూడా చూడమని పిలుస్తున్నాయి.

సభలో, క్లాసులో వెనుకనున్న వారికి వీపులే కనబడతాయి. వేదికమీద వారికి ముఖాల పండగలే. కొందరికి జడలో

పువ్వులు తురిమిన వారి వెనుక కూర్చోవాలని యిష్టం. పువ్వులు చూడటానికి, కొద్దిగ వచ్చే వాసన పీల్చడానికి. వీపులు చూడాలని కాదు. దేహ సాహిత్యములో వీపు ఉపేక్షిత. అన్ని ఉపేక్షలను సహిస్తూ, తన పనిని తాను చప్పుడు లేకుండా, ప్రకటనలు చేయకుండా చేసుకొంటూ పోతుంది; కార్ఖానాలో పనిచేసే కూలీ మాదిరి.

దెబ్బలు తినేది వీపు. గుర్రం వీపు మీదనే కంజీ దెబ్బలు, ఎద్దు వీపు మీదే దెబ్బలు, కనబడకుండా కొట్టాలంటే వీపు మీద కొట్టాలి. బరువులు మోసేది వీపులే. జీను వేసేది గుర్రం వీపు మీదే. అంబారీ కట్టేది ఏనుగు వీపు మీద. హుషారు కలిగించేది వీపును తట్టే, మనుష్యులలో కన్నా, జంతువులలో వీపుకు ఎక్కువ ప్రాధాన్యం, పక్షులలో వీపులు అంటే వుంటాయి రెక్కలు. ఉపేక్షితయైన వీపును పలుకరించి, అసలు విషయానికి వస్తాను.

సంసార సాగరానికి వీపు చూపితే తప్ప, నీ సాధన కుదురదు. యోగము సిద్ధించదు. నీ లక్ష్యాన్ని చేరుకోలేవు. జ్ఞానోదయము కలగాలంటే, విషయలంపటలకు వీపు చూపక తప్పదు. వీపును త్రిప్పట మంటే పెడ మొగము పెట్టుట. కొంత ఉదాసీన భావాన్ని పెంచుకొనుట, కోరిక తొడిమల గిల్లివేయుట. అభిమానాలు, అనురాగాలను కృశింప చేయుట, ఆత్మార్పణ చేయుట, లక్ష్యసాధనకై సాష్టాంగ ప్రణామము కావించుట, శరణమడుగుట, అణుకువను చూపించుట, ఆ సంచి లోని సామానులే, ఆ పొదిలోని అంబులే.

యోగులు సంసారమునకు వీపులు త్రిప్పి, అడవులకు ఏగుట, పర్వతగుహలకు చనుట మనకు విదితమే. అరణ్యపర్వము, అరణ్యకాండ, సుఖలాలసలకు వీపుల త్రిప్పుటే గదా!

దేశ స్వాతంత్ర్యమునకై శిక్షింపబడి జైలుకేగుట బంధు మిత్రుల స్నేహసంపద నుండి తొలగించుటయే కదా. ఆనంద భోగాల నుండి వంచితులగుటయే గదా! వీడ్కోలు నిచ్చి బరువైన వీపులతోనే తిరిగివస్తాము.

ప్రపంచ కోలాహలముల నుండి వీపును త్రిప్పు. లక్ష్య సిద్ధికై ముందు చూస్తూ, ముందుకు సాగు. నీ పిలుపు విని ఎవరూ అనుసరించకపోతే, నీవు ఏకాకిగానే చను. నీ జండాను దింపకు, నీ కాగడాను నెత్తురు చమురుతో వెలిగించుకో. నీ దేహాన్ని నీ ప్రాణాన్ని దీపపు వత్తిగా పేనుకో. నెమ్మదిగా నీ వీపును చూస్తూ, ప్రజలే అనుసరించి వస్తారు.

వీపు చూపినవారే జ్ఞాన సిద్ధులు, యోగీశ్వరులు, కార్య శూరులవుతారు. వీపుల పిలుపులు విని ప్రజలు మూగుతారు. సంకోచించకు, పద, వీపు త్రిప్పు.

తీరానికి వీపు త్రిప్పి, అలల కడలిలో నీవు పడవను తేల్చుకో, తెడ్లు వేసుకొంటూ, నీల దిగంతములవైపు చను, దారులు, డొంకలు లేని ఆ రాజ్యానికి నీవే ప్రభువువు.

28-3-88,

జగతి నుండి.

# 7

# ఖద్దరు సత్యాగ్రహం

నేను కృష్ణాపత్రికకు పంపిన వ్యాసాన్ని, దానిని సంపాదకీయముగ ప్రచురించి నాకు కొండంత ఉత్సాహాన్ని కలిగించిన సంపాదకులు గురుతుల్యులు శ్రీ ముట్నూరి కృష్ణరావుగారికి శతకృతజ్ఞతాభివందనములు. 1934 సం॥ మార్చి 31వ తేదీన నేను కురుచపరిచిన—విజయగోపాల్ పేరుతో ప్రచురించారు.

1932_33 స్వరాజ్య పోరాటములో మేము వెల్లూరు జైలులో సహనివాసులము.

నేను వారివద్ద అభిజ్ఞానశాకుంతలము, నాగానందము సంస్కృత నాటకములను పఠించితిని. వారి పాండిత్యము ఎంత గంభీరమో వారి సౌజన్యత ఎంత విశాలమో స్వయముగ నాకు తెలిసిన విషయము.

కొన్ని కొన్ని తిథులు హఠాత్తుగ ప్రాముఖ్యమును బొంది స్వదేశవాసు లందరికి పవిత్ర దివసములై వెలయును. ఒక లోకోత్తరుడగు మానవ పుంగవుని జన్మము చేతనో, నిర్యాణము చేతనో, జాతీయ జీవితమున ఘటించిన విశేష కృతి చేతనో ఆ దినము అమర స్థానమును వహించును. అయ్యది జాతియొక్క స్మృతి యందు అంకితమై, జాతీయాభివృద్ధి

కెంతయు దోహదము నొనగుచుండును. స్వయముగ నా దినమున కెట్టి విశేషము లేక పోయినను, భక్తుల. అనుష్ఠానపరుల భక్తి విశ్వాసములా వాసరము నాశ్రయించి, దానితో నొక యనిర్వచనీయమైన బాంధవ్యమును గల్పించును. దానినే పర్వదినముగ గణించి ఆ ఘటన నైజమును బట్టి పూజార్చనలను ఆచరించుచుందుము.

*                    *                    *

శ్రీరామనవమి, కృష్ణాష్టమి, భీష్మైకాదశి, వినాయక చతుర్థి మున్నగు పండుగలు అట్టివే. చైత్రశుక్లనవమి సంపాదించిన పవిత్రత పేరు ప్రతిష్ఠలు ఇతర శుక్ల నవములకు లేవు. భాద్రపద శుక్ల చవితి నాడు విద్యార్థులు చూపు ఉత్సాహము వేరొక చవితి నాడు కన్పించదు. పరమేశ్వరుడు లోకోపయోగార్థము హాలాహలాగ్నిని మ్రింగి నీలకంఠుడైన దినమగుటచే మాఘ బహుళ త్రయోదశి నీరు ఎరుగని, నిద్ర తెలియని భక్తి దివసమైనది.

*                    *                    *

ఆషాఢ ప్రథమ దివసము, చైత్ర ప్రతిపద, మకర సంక్రాంతి మున్నగు దినములు, వేరు కారణములచే మనకు పూజనీయములుగ నున్నవి. శతాబ్దముల క్రితము ఒక కవి, కల్పిత కావ్యమున, ప్రేమికులగు ప్రవాసుల విరహకాతరత మేఘావలోకనమున వృద్ధిచెంది, చేతనాచేతన జ్ఞానమును పోగొట్టుకొని ఉన్మాదముగ మారునని నిరూపించి, ఆషాఢ ప్రథమ దివసమును భారత వర్ష విరహుల దుఃఖదినముగమార్చి, ప్రేమోత్సాహులకును. కవితోపాసకులకును ప్రియమగు దిన

ముగ గావించెను. కాళిదాసు ఆ అమరకావ్యమును రచింపకున్న, ఆషాఢ ప్రథమ దివసపు ప్రత్యేకత యేమియు లేదు.

*　　　*　　　*

ఉత్తర హిందూస్థానమున అతి ఉల్లాసముతో గావింపబడు 'దోల్ పూర్ణిమ' (ఫాల్గుణ పౌర్ణమి) విశేష చిహ్నితమగుటకు హేతువేమి? మదన సమ్ముఖమున వసంత తరువునకును, నిండు జవ్వని యగు జ్యోత్స్నలతకును జరుగు వివాహ మహోత్సవమున. దక్షిణ సమీరములు, శుకశారికా పికములు, భ్రమరములు. అరుణ పల్లవములు, తరుణప్రసూనములు, కోరకములు, పరిమళములు, పుష్పరజములు విలసిల్లియుండ, ఆనందమునకు తక్కువ యేమి? ఆహ్లాదపరచు వసంతమున, తన్మయత్వపరచ పూర్ణజోత్స్న వచ్చి చేరుటకన్న ప్రకృతి రామణీయకపు చరమ అంతస్తు ఎద్ది?

*　　　*　　　*

మహనీయుల దివ్య చారిత్రములును అట్లే యెడారిలోని జలాశయముల రీతి, ఒక్కొక కాలమును భావభరితముగ జేయును. గాంధి పుట్టినదినము (అక్టోబరు-2వ తేది). రవీంద్రుని పుట్టిన తిథి (మే 7వ తేది). మనదేశమున సత్యాగ్రహ ప్రారంభ దివసమగు ఏప్రిల్ 8వ తేది — ఈ మూడు తిథులును నవ్య భారతీయుని ప్రతి సంవత్సరమును ఆకర్షించుటకు గారణమేమి? ఇవి సమీపించు కొలదిని, ఎదురుచూచు బాల్యమిత్రుని రాకవలె ఆనంద పరచుచుండును. ఈ దినముల నిద్రనుండి మేల్కాంచగనే వాని మహత్తు అప్రయత్నముగనే జ్ఞాపకమునకు వచ్చును. అనాదంతయు, ఒక అజ్ఞాత ఆనందము. ఉల్లాసము ఆవహిం

చును. ఆ దినమున ఇతర కార్యములయందు నిమగ్నులమై యున్నను, వాని స్మృతి అంతరమున మేల్కొంచియే యుండును. ఆనాడు స్నేహితులకు వ్రాయు ఉత్తరములలో ఆ దివసపు ఉత్కృష్టతను గూర్చి సూచించవలెనని గూడ ఉద్దేశము కలుగు చుండును.

*  *  *

వెలుపలి ప్రకృతి రామణీయకము చేతనో, సంగీతాది రసముల స్పర్శచేతనో, అభిమాన విషయ సంఘటన చేతనో, లోకము ఆనంద పడుచుండుట మనకు తెలిసిన విషయమే. కాని మనకు ప్రత్యేకముగ నెట్టి సంబంధము లేని, ఒక సుదూర దివస సంఘటన తన స్మృతి సందేశమును బంపి నూతన చైతన్యమును మనలో సృజింప జేయుటకు హేతువేమి యని తలపోయుదు. గాంధి రవీంద్రుల మీద మనకు గల పూజ్య భావము వారి వారి జన్మ తిథులయందు ఆనందధారయై వెల్లి విరియుచుండునా యని సంతృప్తికరముగాని సమాధానమును చెప్పుకొనుచుందుము. మనలో ఉద్భవించు ప్రతి సూక్ష్మ భావము నకు, రసమునకు శాస్త్ర సమ్మతమగు సమాధానమును ఊహింప దలచుట అసమంజసము. రక్త పరీక్షవలె భావపరీక్ష ప్రయోజన కారి కాజాలదు.

*  *  *

భారత వర్షము నంతను వ్యాపించి, విజృంభించిన రెండు ఉద్యమములును ఏప్రిల్ 6 వ తేదీననే జన్మించుట అపూర్వమగు దైవ సంఘటనయే. 1919 వ సంవత్సరమున, రౌలట్ శాస నమునకు అసమ్మతిని ప్రకటించుటకు ప్రారంభమై, జలియన్

చాలా బాగున స్రవించిన వీర రక్తముచే ఉద్దీపననొంది, కిలాఫతు అక్రమముచే మరింత ఉత్సాహమును గడించి, స్వరాజ్య సంపాదనకై, అసహాయోద్యమముగ మారి, దేశమంతయు మధించి, కలచి వైచిన సత్యాగ్రహోద్యమము ఏప్రిల్ 6 వ తేదీననే జన్మించినది. 1930వ సంవత్సరమునకు సత్యాగ్రహ కళిక ప్రస్ఫుటించి, తన శత పత్రములను విప్పి విరియబూచి సత్యము, అహింసయను సౌరభములను ఖండాంతరములకు సహితము పంపి అపూర్వమగు ఆందోళనకు కారణభూతమాయెను. ఆ సంవత్సరమున తిరిగి ఏప్రిల్ 6 వ తేదీననే, మహాత్ముడు ఆశ్రమవాసులతో గూడ దండీ సముద్రతీరమునకు మహాయాత్ర గావించెను. ఆనాటి నుండియు దేశము ప్రదర్శించిన త్యాగము, సాహసము, సహనము, ఏ చరిత్రయందు గూడ మనము కని విని యెరుగము.

* * *

యమునా తీరపు తమాల నికుంజముల నుండి బయల్వెడలిన మురళీనాదము లోకమును సమ్మోహపరచి, ప్రేమ మార్గమును భక్తులకు చూపించెను. తిరిగి సబర్మతీ తీరపు జీర్ణ కుటీరము నుండి బయల్వెడలిన రాట్నరావము ప్రజలను సుఖనిద్ర నుండి మేల్కొల్పి, త్యాగమార్గమును చూపుచున్నది. త్యాగము చూపజాలని ప్రేమ భక్తిరసములు నిరర్థకములు త్యాగస్పర్శమణి తాకుడు చేతనే, ప్రేమ పునీత మగుచున్నది. ఆత్మ సమర్పణ చేతనే భక్తుడు పారలౌకిక సత్యరహస్యమును వినగల్గుచున్నాడు. ఆత్మవితరణము చేతనే, అతీత శక్తి యొక్క దివ్య దర్శనము సిద్ధించుచున్నది. ప్రేమోపాసన ఆత్మ సమర్పణ

వేదిక పైననే జరుగవలసియున్నది. ద్వంద్వము యొక్క పూర్ణ వినాశము మీదనే ప్రేమ తన్మయత్వపు ప్రతిష్ఠ.

* * *

త్యాగము పైననే సృష్టి ఆధారపడియున్నది. కాంతి ప్రవాహము, వర్ష బిందువులు త్యాగ ఫలితములే. జీర్ణ పర్ణముల త్యాగమే అరుణ పల్లవములకు తావొసగినది. కమలకోరకము కన్యత్వమును విసర్జించియే పరిమళముల ప్రసవించుచున్నది. కొన్ని కొన్ని స్వరముల త్యాగము చేతనే (లోపించుట) భిన్న భిన్న రాగోత్పత్తి గలిగి, యింతటి విశాల గాంధర్వరాజ్యము మనకు హస్తగతమైనది. త్యాగ మహా కావ్యము కాదా ! మాతృత్వము కార్మికుల, కర్షకుల ప్రతి స్వేదబిందువు నందును త్యాగ రూపము ప్రతిబింబించుచుండును. వారి ప్రతి ఉచ్ఛ్వాసము నందును త్యాగము యొక్క గంభీరస్తోత్రపు 'ఉదారచ్ఛందము' ముఖరిత మగుచుండును.

* * *

భారత వర్షమునకు ఆదినుండియు త్యాగమనిన ప్రత్యేక అభిమానము. ఈ దేశపు నాగరికత, సభ్యతలు రాజప్రాసాదముల లోను మహాపట్టణములలోను జన్మించి యుండలేదు. అరణ్య సీమల ఆశ్రమ వాసులగు మహర్షులే మన సభ్యతయొక్క కేంద్ర స్థానములు. వారినుండి ప్రసరించిన జ్యోతియే మన నాగరిత యొక్క ఆయువు. దిగంబరత్వము యొక్క, భిక్షాటనల యొక్క గౌరవము మరెచ్చట గలదు? త్యాగ వర్ణమగు కాషాయము, సాధువులకు మరెచ్చట గ్రాహ్యమైనది? మన వేదాంతములు, మన శాస్త్రములు, త్యాగమునే, ఆత్మ వితరణమునే ఉపదేశించుచున్నవి.

ఆధునిక పశ్చిమ మేఘములు ఈ పూర్వదేశపు ఆధ్యాత్మిక శక్తిని మరుగు పరిచినవి. పట్టణముల సభ్యత విజృంభించినది. ఆత్మ సమర్పణకు బదులు, ఇంద్రియ పోషణమే చెలరేగు సూచనలు కాన్పించినవి. అట్టి తరి భరతభూమి యొక్క పూర్వోన్నతిని ప్రదర్శించుటకు, త్యాగ ప్రభంజనములు బయల్వెడలినవి. ఒక సాధు పుంగవుడు సంధించిన వాయవ్యాస్త్రముచే ఆ దట్టమగుచుండిన మేఘములు చెల్లాచెదరై పోయినవి అతడు పూరించిన పాంచజన్యముచే త్యాగశక్తి తిరుగ మేల్కాంచినది. కాషాయ వర్ణము, దేశాభిమానము యొక్క ప్రత్యక్షమూర్తియగు జాతీయ పతాకమున స్థానము సంపాదించినది. అట్టి సుదినమే, త్యాగము పునః ప్రతిష్ఠాపితమైన పవిత్ర దినమే ఏప్రిల్ ఆరవ తేది. మహాత్ముని ప్రేమమంత్ర బలముచే పునర్జీవితమైన త్యాగము జీవితము యొక్క ముఖ్య సూత్రము. సత్యము, అహింసయను కళ్ళెములను గలిగిన త్యాగమను గుఱ్ఱము, ఆత్మయను తేరును లాగుచున్నది. మహాత్ముని సారధ్యము క్రింద రథము గమ్యస్థానమును చేరగలదనుటకు సందియము లేదు. ఆ రథాగ్రముపై రాటపు కేతనము అఖిల భారత సంతానమునకు ఖద్దరు దీక్షా మంత్రము నెట్లుపదేశించుచున్నదో కనుడు !

* * *

ఏప్రిల్ 6 వ తేదీ నుండి సప్తాహము ప్రారంభమగును. నాడు పల్లె పల్లె గృహగృహము రాట్నలక్ష్మిని బూజింపకుండ నెట్లుండును? ఖద్దరు దీక్షాపరులు ఖద్దరు మూటల నెత్తిమీద బెట్టుకొని, ఇంటింట తల్లులకు చీరెలను జదివించకుండ నెట్లుండ గల్గుదురు? అతి పవిత్రమైన వారము- స్వారాజ్య మంత్రమును భక్తి పురస్సరముగ జపించు పుణ్య వాసరము. భారత భాగ్య

రేఖలను ప్రేమనయనములతో నేత్ర పర్వముగ వీక్షించు మహో దయము హృదయ దౌర్బల్యమును వీడుము. సత్య కవచ ధారివై విశ్వాసమురళిని బూరించుము. ఆ యమృతధారల నోలలాడి దివ్య జన్మ నెత్తుము. నీ దివ్యజన్మయందు నీ జాతి తిరిగి ప్రబుద్ధమై సకల భాగ్య భోగముల ననుభవించ గలదు.

విజయ గోపాల్

# 8

# ప్రేమ స్వరూపము

## ఉపమా వింశతి

(ఆంధ్రపత్రిక, ధాతనామ సంవత్సరాది సంచిక (1936) లో ప్రచురింపబడినది.

సంపాదకులు విశ్వదాత దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు గారిని స్మరిస్తూ, వారికి వందనము లర్పించుచున్నాను .

1. ప్రేమాంకురము : యౌవన వసంతావిర్భావమున హృదయమున జాగృతమైయున్న సౌందర్యస్మృతి ఛాయ యందు, నిశిథ నయననీరములచే పోషింపబడుచున్నది.

2. ప్రేమస్ఫులింగము : తన్వీనయనవహ్నిచే జన్మ మెత్తి, ఎరుగని ఆశామారుతములయొక్కయు, ఎరిగిన నిరాశా ప్రభంజనములయొక్కయు, క్షుద్రరూపము లగు ఉచ్ఛ్వాసము లచే పెంపొందుచున్నది.

3. ప్రేమసాగరము : ప్రేయసీ ముఖచంద్రావలోకన మున ఉప్పొంగి, సంసారపు అలల ఆటుపోటులచే జీవిత నౌకను ఊపుచున్నది.

4. ప్రేమకోరకము : అధరపల్లవముల చెరనుండి తప్పించుకొనిన స్మిత చంద్రికలచే విరియబూచి. అజ్ఞాత యౌవనకు సిగ్గు గరపుచున్నది.

5. ప్రేమభుజంగము : ప్రియురాలి మధురగానముచే సుషుప్తినుండి మేల్కాంచి, ఆమె దీర్ఘ వేణీబంధముతో వియ్యమును వాంఛించుచున్నది.

6. ప్రేమజ్యోతిరింగణము : కాళరాత్రి, అభిసారమునకై వెడలిన గోపికకు. మురళి మ్రోయుచున్న తమాలవాటికకు త్రోవ చూపుచున్నది

7. ప్రేమప్రదీపిక: విరహిణీ వీక్షణజ్యోతిచే వెలిగింపబడి, మందమలయమారుతుని మృదుస్పర్శచే వ్యాకులమున కంపము నొందుచున్నది

8. ప్రేమతరంగములు : శారద పూర్ణిమారాత్రమున వాసకసజ్జికయొక్క ఉచ్ఛ్వసితపక్షమున, ఆనందపులకముల రూపమును దాల్చుచున్నవి.

9. ప్రేమమురళి : నిగూఢ అస్పష్ట వేదనాగానమును ఆలపించుటకు, విరహతప్త అరుణ అధరముల బుజ్జగింపుల ఆశించుచున్నది.

10. ప్రేమమయూరము : ప్రాసాదశిఖరమున వసంత సమీరములచే సడలింపబడిన కామినీకేశరాశినిగాంచి అకాలనృత్యమొనర్చుచున్నది.

11. ప్రేమవల్లిక : చకితనయనతరళ సౌదామినులచే గిలిగింతలుపొంది, నవనవ భావమంజరులచే విరాజిల్లి, గృహస్థాశ్రమ వనస్పతిని ఆశ్లేషింప బాహువుల చాపుచున్నది.

12. ప్రేమవిపంచిక : విరహిణీ వాడిన వ్రేళ్ల తాకుడు లచే విషాదరాగిణుల ఆక్రందించి, శ్రావణ శర్వరిని యేడ్పించు చున్నది.

13. ప్రేమపికము : మదిరాక్షుల అరుణ అపాంగ ప్రవాళముల మెసవి, హృదయ నికుంజతలమున నిరీక్షణగీతికల పాడుచున్నది.

14. ప్రేమజ్యోత్స్న : ప్రవాసుల వియోగము వేడిమి అంతరించుననియు, ప్రేమికుల భావకళికలు వికసించుననియు సూచించుచు ఆశావాదమును ప్రకటించుచున్నది.

15. ప్రేమప్రసూనము : పరివేష్టించియున్న తరుణ కంటకములను, వృద్ధ పర్ణములను, కిశోర కోరకములను మోస గించి, పరిమళ సందేశములచే భ్రమరేంద్రుని బిలుచుచున్నది.

16. ప్రేమ మరాళము : ప్రియురాలి మనస్సరోవర మును చేరి తేలియాడుటకు, అభ్రభేది హిమాద్రిశిఖర శిరః పంక్తిని గూడ కాలదన్న సంశయింపకుడని హెచ్చరించు చున్నది.

17. ప్రేమ విహంగము : శుక్రాచార్యులవారు, అంతే వాసులగు అరుణోదయ దీధితుల వెంట నిడికొని, తూర్పుదిశ నుండి వేంచేయుచున్నాడని అభిసారమునకు వెడలి తారసిల్లు చున్న 'తార' ను మేల్కొల్పుచున్నది.

18. ప్రేమరసము : శుష్కహృదయ మరుభూముల సించిత మొనర్చి, పుష్పిత నికుంజతలముల సృజించి, స్వర్గ లోకపు సౌందర్యచ్ఛాయను తన బిందువులలో ప్రతిబింబించి, కవులకు చూపుచున్నది.

19. ప్రేమ స్రోతము : కలస్వనమున ప్రేమమంత్రము జపించుచు, అంతరాయముల ఉల్లంఘించుచు, ఏక క్షణ విలంబనమునయిన సహించనేరక ప్రియదర్శనార్థమై అహర్నిశము పరువులిడుచు వచ్చి, నీలగాత్రుడు, లవణజిహ్వుడు, భైరవ ప్రలాపముల ప్రేలు, భయంకరుడగు సాగరుని తరంగముల కౌగిలిలోనే ఆత్మోత్సర్గము గావించి, 'ద్వంద్వముయొక్క పూర్ణవినాశము మీదనే ప్రేమ తన్మయత్వప్రతిష్ఠ' యని తన అంత్యసందేశమును చాటుచున్నది.

20. ప్రేమకమలము : శతపత్రములను విప్పి, సౌరభ తన్మయత్వముచే లోకముయొక్క స్తోత్రమునకు పాత్రమగుచున్నది. హీనకులజయైనను లోకగ్రాహ్యమైనది. లక్ష్మికిని, బ్రహ్మకును ప్రియతరమైనది. ప్రియురాలి ముఖ, నేత్ర, కర, పాదములతో అవిభక్తమగు బాంధవ్యమును కవివరప్రసాదమున సంపాదించినది. సంసారమున నున్నను దాని అలజడులచే అశాంతి నొందకుడని స్వీయజీవితమున ప్రదర్శించుచున్నది.

# గంపలగూడెం కుమారరాజా

"స్వాతంత్ర్య సామిధేని" పుస్తకము చేరినది. సాంతముగ చదివితిని. నా చిన్ననాటి జ్ఞాపకాలు ఒక్కసారిగా లేచి వసంత కోకిలలవలె పాడ ప్రారంభించినవా యని తోచినది. బాల్య వాతావరణమునకు వెళ్ళి విహరించినాను. నేను 1921 జనవరిలో కాంగ్రెసు పిలుపున సర్కారు బడి వదలితిని. ఫిబ్రవరిలో బందరు ఆంధ్ర జాతీయ కళాశాలలో చేరితిని. ఆనాటి నుండి నడుస్తున్న చరిత్రను చూచుచునే ఉన్నాను. గంపలగూడెం (కుమార) రాజా బరంపురంలో చేసిన ఉపన్యాసమునకు శిక్షింపబడి నెల్లూరు జైలులో ఉన్నారని తెలియును. 1922 లో మా బావ తిక్కవరపు రామిరెడ్డి, మా అన్న బెజవాడ చంద్రశేఖరరెడ్డి ఆ జైలులోనే ఉండుటను తెలిసికొన్నాను. ఆనాటి నుండి గంపలగూడెం రాజా పేరు వింటూనే వచ్చాను. 1931 వరకు నేను వారిని చూడలేదు. తెలుగు పాండిత్యము కలవారని, కవియని వింటూనే వచ్చాను. వారు రచించిన గ్రంథములు నాకు దొరకలేదు. అందువల్ల వారి పాండిత్య ప్రశంసను నేను చేయుటలేదు. నాకు తెలిసిన రాజా జాతీయవాది, స్వాతంత్ర్య సమరంలో సేనాపతి, వచో నైపుణ్యము కలవారు.

ఆనాటి జమీందారీల వైఖరి, పానుగల్లు రాజా నాయకత్వమున జస్టిస్ పార్టీ అవలంబించిన తీరు నేను మరవలేను. అట్టి పరిస్థితిలో గంపలగూడెం రాజా జైలుకు వెళ్ళడం అపూర్వమైన సంచలనము కలిగించినది. చిత్తరంజన్‌దాస్, మోతీలాల్ నెహ్రూ, జమునాలాల్ బజాజ్ మున్నగు ఐశ్వర్యవంతులు వారి రాష్ట్రములలో పొందిన ప్రతిష్ఠనే తెలుగుదేశములో గంపలగూడెం రాజా సంపాదించుకొన్నారు.

నేను 1930 ఉప్పు సత్యాగ్రహములో తొలి దళాధిపతిగా జైలుకు వెళ్ళినాను. నేను నెల్లూరు, కడలూరు, జైళ్ళలో ఉండినాను అప్పుడు గంపలగూడెం రాజా వేరే జైళ్ళలో ఉండినారు. జైలు సహచరులముగ లేము.

గంపలగూడెం వారి బంధువులు కటికనేని కళ్యాణరావు, వెంకట రామారావు వెంకటగిరి రాజాను ఎదిరించి కాంగ్రెసు ఉద్యమములో చేరి జైలుకు ఏగుటయు మరవరాని స్మృతి.

ఆంధ్ర ప్రదేశ కాంగ్రెసు కమిటీకి అధ్యక్షులైనది గుంటూరులో. కాటగడ్డ మధుసూదనరావు, శరణురామస్వామి చౌదరి, చింతమనేని భావయ్యల పట్టుదలతో రాజా అధ్యక్షులైనారు. ఆ సభలో నేనున్నాను. అయ్యదేవర కాళేశ్వరరావు ప్రధాన కార్యదర్శి, న్యాపతి నారాయణమూర్తి, నేను సంయుక్త కార్యదర్శులుగా ఎన్నుకొనబడితిమి. అదే నా రాజకీయపదవులకు, ప్రభుత్వ పదవులకు పునాదిరాయి. చిత్తూరు వగైరా జిల్లాలలో పర్యటించినాము. తిరుగ 1932 జనవరిలో గాంధీజీ అరెస్టుకాబడిరి. కాళేశ్వరరావు, నేను మరలా జైలుకు వెళ్ళినాము. 1937 జూలైలో నేను మద్రాసు మంత్రిగా బెజవాడకు వచ్చినపుడు రాజా నన్ను కలిసి ఆప్యాయముగ ఆదరించినారు. వారి సంయుక్త కార్యదర్శి

మంత్రి యగుట వారికిని సంతోషమే కదా ! రాజా శాసన సభలకు నిలువలేదు. కాని వారి త్యాగము, దేశభక్తి, కార్యనిరతి ఆంధ్రదేశములో ఎంతో ఉత్సాహాన్ని కలిగించినది.

ఎంతెంతమంది దేశభక్తులు, త్యాగశీలుర కష్టనష్టాలు స్వరాజ్యానికి పునాదియైనాయి! అన్ని రాళ్ళు స్వరాజ్య భవనములో చేరలేవు. కొన్ని రాళ్ళు పునాదులుగనే నిలిచిపోతాయి. మట్టిలో కూరుకపోయేవే కొన్ని మాత్రమే భవనములో చేర్తాయి. అన్నీ శిఖరాన్ని అందుకోవు. రాజా ఆంధ్ర మహాసభాధ్యక్షులుగ, రాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షులుగనే తృప్తిపడ్డారు. పదవులు కాదు కాంగ్రెసు పునాది, త్యాగాలు అవే స్వరాజ్యాన్ని సంపాదించి పెట్టాయి. మహనీయుల త్యాగాల సిద్ధికి మనము వారసులము.

జ్ఞాత, అజ్ఞాత వీరుల సమాధులపై స్వరాజ్య సింహాసనాలు ! అట్టి వీరులకు కృతజ్ఞతాంజలి ఘటించుట మన కనీస ధర్మము. రాజా త్యాగాలు, సేవలు మరువరానివి.

ముటుకుంట్ల వేంకటప్పయ్య రాజాగారి చరిత్ర వ్రాసినందుకు వారికి ధన్యవాదములు. ఈ నాలుగు మాటలు వ్రాసే అవకాశము కలిగించినందులకు గర్వపడుచున్నాను.

ఆఖరిమాట : అన్ని అభ్యుదయములకు ఆద్యుడని, దేశభక్తి పూరితుడని, దేశమంటే మనుషులని పొగడి ప్రచారము చేసే గురజాడ అప్పారావు అభిమానులు, 1915లో రచించిన గురజాడవారి ఈ క్రింది పద్యమును గమనింప గోరుచున్నాను. దేశభక్తి కన్న ప్రభుభక్తి, దొరలభక్తి ఎక్కువ యేమో ! అభిమానులు మన్నింతురు గాక !

"వచ్చెనిది బంగారు కాలము
వాంఛలెల్లను తీరు సుజనుల

కాంగిలేయుల ధర్మరాజ్యము
జ్ఞానమును స్వాతంత్ర్య మిచ్చుచు
సంతతము వర్ధిల్లు గావుత."

దీనికి జవాబుగ రాజాగారు జైలులో ఈ క్రింది పద్యము రచించిరి :

వచ్చెను దండయాత్రలొక
వందయొ, వేయియొ, యెన్నియైననీ
మచ్చున సర్వనాశనపు
మంగళహారతి పాడలేదు పై
వెచ్చిది సుప్రభుత్వమని
వెఱ్ఱి తలంపులనూని యెంతయో
యిచ్చక మాడుసోదరుల
నేమనజెల్లును మాతృదేశమా !

శాంతినికేతన్,
నెల్లూరు—3
31-8-1988

# 2

# తెలుగు విశ్వవిద్యాలయం

రెండవ సంస్థాపనాదివసం — పుట్టిన పండుగకు మన లందరినీ సమకూర్చారు. ఈ విశ్వవిద్యాలయం ఒక శిశువు. విదియ చంద్రుడు—ఎంతో భవిష్యత్తును, ఎన్నో కలలను దాచు కున్నవాడు—దినదిన ప్రవర్థమానమై తన వెన్నెల వెల్లువలను వెదజల్లుచు వికసించాలి. దీనికి పూర్ణిమ గమ్యస్థానం. అది చేర లేనిదే; ఎక్కలేని శిఖరమే. పూర్ణిమకు విరుగుడు ఉన్నది. మన జ్ఞానపూర్ణిమకు బహుళ పక్షాలు లేవు. నిత్య శుక్ల పక్షాలే.

ఈ సంస్థాపనా దినం-జరిగిన సంగతులను, జరగవల సిన విషయాలను తలపోసుకొనుటకై ఉద్దేశింపబడినది. ఒక సింహావలోకన, భావి ప్రయాణమును సాగించవలసిన దినం. ముందు దిగంతములు ఆహ్వానిస్తున్నవి. మనం పోయిన కొద్దీ, ఆ దిగంతములు తిరోగమిస్తూ ఉంటాయి. సహస్రయోజనముల ప్రయాణం తరువాతను కూడా ఆ దిగంతములు అంత దూర ములుగనే కనుపించుచుండును. అవి చేరలేని లక్ష్యాలు. కానీ మనము చేయవలసిన యత్నాలు చేయుచునే ముందుకు విక సించాలి. అందువల్ల ఈ సంస్థాపన దివసం ఒక పుణ్యతిథి.

అందులకు నన్ను ఆహ్వానించినందులకు నేను ఆనందించు చున్నాను, గర్వించుచున్నాను.

ఈ విశ్వవిద్యాలయ సాగరంలో అనేక స్రవంతులు విలీన మయ్యాయి. అనేకదిశలనుండి అనేక ఎత్తులనుండి, పల్లముల నుండి ఈ సాగరములో తమతమ తోయములను అర్పించాయి. వాని అన్నిటి ప్రభావము ఈ విశ్వవిద్యాలయ ప్రాంగణములో మనకు కన్పించును. వారు సేకరించిన సంపదలకు ఈ విశ్వ విద్యాలయం వారసత్వాన్ని వహించింది. వారిచ్చిపోయిన సంప దను వినియోగించుట మాత్రమే చాలదు. దానిని అధికతరము చేయవలసిన బాధ్యత ఈ విశ్వవిద్యాలయం మీద కలదు. వారు నాటిన మొక్క పెద్ద వృక్షమై పుష్పములతో ఫలములతో జను లకు ఆనందమును చేకూర్చుగాక! భూతకాలము వర్తమాన కాలాన్ని ప్రసవించింది. భవిష్యత్తుకు హితవైన సన్నాహాలు చేసు కోవలసిన తరుణమిది. చేసిన దానికి సంతోషమే, చేయవలసిన దానికే మనము శ్రమించాలి. తపస్సు చేయవలెను. సాధించాలి. సాధించిన విజయాలకన్నా సాధించవలసిన విజయాలు జటిల మైనవే కావచ్చు. కష్టతరములైనవే కావచ్చు. కానీ మనం నిండు ధైర్యంతో, విజయ సమరాలను నిర్వహిస్తూ, ఆనందశంఖా రావములను పూరించుకుంటూ ముందుకు సాగాలి. మన మార్గము కఠినమైనదే, కంటకావృతమైనదే; అట్లని మనం ఉన్నచోట నిలచి పోవుట పిరికిపందల పని. భవిష్యత్తును నిర్మించే యోధులం మనం భవిష్యత్తు శ్రేయస్సుకై మనము తపస్సు సలుపు చున్నాము. ఆ తపస్సు రూపకల్పన చేసుకుని ప్రత్యక్షాకారంతో ప్రజలకు ఆనందమును, హితవును ప్రసాదించాలి. ఇది కేవలం విజ్ఞానవంతులకు మాత్రమే పరిమితం కాగూడదు; నగరవాసు లకే ఉపయుక్తం కాకూడదు. జానపదులకు, పల్లెసీమలకు దీని

వెలుగు ప్రసరించాలి. మీ పరిధిలో చరిత్ర, సంస్కృతి, సాహిత్యం, సంగీతం, చిత్రకళలు అన్నీ ఒదిగి ఉన్నాయి. ఇవన్నీ ఒకనాడు మన అడవి గుడిసెలలో, పల్లె సీమలలో ఉత్పన్నమైనవే. దానిని మనం మరచుటకు వీలులేదు. జానపదులకు ఇవ్వవలసిన విజ్ఞానము, ఆనందం తగిన దామాషాలలో ఇవ్వాలి. జానపద సంగీతం, జానపద నృత్యం, కళలు, క్రీడలు అన్నిటికీ మనం కొత్తరూపు ఇవ్వాలి. కొత్త ప్రాణం పోయాలి. ఇంత పవిత్రమైన సంకల్పంతో ఈ తెలుగు విశ్వవిద్యాలయం స్థాపింపబడినది. ఆ సంకల్పము మన వికాసములకు సోపానములు కావాలి. అప్పుడే మనకు పరితృప్తి. భాష, సాహిత్యము, చరిత్ర, వాని పరిశోధనతో పాటు, తోలుబొమ్మలు, పల్లెసీమల వినోదాలు, ఇందు ప్రతిబింబించాలి వృత్తి. వృత్తికో సాహిత్యముతోపాటు సంగీతము ఉన్నది. ఆ జానపదసంగీతంపై ప్రత్యేక శ్రద్ధను చూపాలి. మన శాస్త్రీయసంగీతం ఆ పల్లెసీమల సంగీతము నుండే పుట్టింది, పూచింది ఈ నాడు టెన్నీసు, క్రికెట్లకు, బిలియర్డ్స్‌కు ఆద్యులైన మన పల్లెటూర్ల ఆటలున్నాయి. వానిని మనం మరువజాలం. వానిని ప్రోత్సహించి తగిన ప్రచారములను ఇవ్వవలెను. మన గోలి ఆటలు సామాన్యమైనవా ? మన బొంగరాల ఆటలు గాలిపటాల ఆటలు మన క్రీడలలో అంటరానివి కావు. వాటిని మనం సమాదరించి ప్రోత్సాహమివ్వవలసిందే. మన సంస్కృతి నాగరికత అన్నప్పుడు ఇతర విశ్వవిద్యాలయాలు, సంస్థలుచేసేపని ఇక్కడ కూడా ఇంకా సుదృఢంగా చేయవలసిన అవసరమున్నది. సాహిత్యము ఇతర విశ్వవిద్యాలయాల పని అనీ, సంగీతము సంగీత కళాశాలల శాఖ అనీ, క్రీడలు స్పోర్ట్సు కౌన్సిలు పని అనీ, పరిశోధన చేయవలసిన పనులు పురాతత్వం వారివనీ

ఉపేక్షించజాలం. వీటన్నిటిలోను మీ విశ్వవిద్యాలయం భాగ స్వామే. శతాబ్దముల నుండి మనకు ప్రాప్తమైన సంస్కృతి సంపదను వినియోగించుకుని దానిని అభివృద్ధి చేయవలసిన కర్తవ్యం ఈ విశ్వవిద్యాలయం మీద ఉంది. ఏ మంచి ఈ విశ్వ విద్యాలయ పరిధికి మించి ఉన్నది? అన్నిటినీ క్రోడీకరించి దానిని విస్తృతం చేయుట ఈ తెలుగు విశ్వవిద్యాలయ బాధ్యత.

ఇది స్నాతకోత్సవంకాదు. ఇది సంస్థాపనోత్సవం. అది విద్యను పూర్తిచేసి, డిగ్రీలు పుచ్చుకున్న విద్యార్థులను సంబో ధించేది; హితవు చెప్పేది. ఈ స్థాపనాదినం పాలకవర్గానికి సూచన చేసేది. ఈ విశ్వవిద్యాలయం స్నాతకోత్సవం జరుపు కోవడానికి తరుణం ఇంకా రాలేదు. స్థాపనా దినోత్సవాన్నే జరుపుకుంటున్నది దీని లక్ష్యమే వేరు. అయినా ఒక పవిత్ర మైన బాధ్యతనే నిర్వహిస్తున్నారు కులపతిగారు.

జస్టిస్‌పార్టీ మద్రాసులో పరిపాలన చేసే కాలంలో ఆంధ్రు లకు ప్రత్యేక విశ్వవిద్యాలయం అవసరమని తలచి ముఖ్య మంత్రిగా ఉండిన పానగల్లు రాజా, విద్యామంత్రి పరశురామ పాత్రో 1926లో కట్టమంచి రామలింగారెడ్డిచే ఒక నివేదికను తయారు చేయించి ఆంధ్ర విశ్వవిద్యాలయ చట్టాలను ప్రసా దించినారు. అది ఒక ప్రాంతానికి సంబంధించినది. తెలుగు జిల్లా లకు సంబంధించినది. దానిలో విశ్వవిద్యాలయమునకు సంబం ధించిన అన్ని హంగులూ, సమస్త విజ్ఞానశాఖలనూ ఏర్పాటు చేసుకోవాలని ఉద్దేశం. దాని సంస్థాపక కులపతి కట్టమంచి రామలింగారెడ్డి. దాని షష్ట్యబ్ది పూర్తి అన్నట్లుగా తెలుగుదేశం ప్రభుత్వం ఈ తెలుగు విశ్వవిద్యాలయాన్ని స్థాపించింది. దీనికి కులాధిపతిగా తెలుగుసంస్కృతి మీద ఆదరాభిమానం చూపి

స్తున్న రామారావుగారే ప్రథమ కులపతిగా తెలుగు ఆచార్యులే. దీనికి లక్ష్యం ప్రాంతం కాదు. సంస్కృతి. అయినా రెండూ ప్రజలకు సంబంధించినవే. రెండూ ప్రజల ఆనందాన్ని శ్రేయస్సునూ కోరేవే. ప్రాంతమన్నా సంస్కృతన్నా మనుష్యులవే. దీనికి న్యాయమూర్తి ఆవుల సాంబశివరావు చేత ఒక నివేదికను తయారు చేయించారు. దాని ఆధారంతో ఈ విశ్వావిద్యాలయం ఆవిర్భవించింది. ఆ సాంబశివరావుగారే నేడు ఈ సభకు ముఖ్య అతిథిగా విచ్చేయడం నాకు చాలా ఆనందంగా ఉన్నది. వీరు చేసిన సంకల్పబీజం ఏ రీతి పరిణతి చెందుతున్నదో వారు చూస్తూనే ఉన్నారు. ఇది బాగా వికసించవలెనని వారు కోరుతూనే ఉన్నారు. వారికి దీనితో ప్రత్యక్ష సంబంధం లేకున్ననూ దీని శ్రేయోభిలాషులు వారు. దీని ప్రత్యేకత—దీని కులాధిపతులు తెలుగువారుగనే ఉన్నారు, ఉంటారు. మామూలుగా గవర్నరులు పరప్రాంతములవారే; వీరే ఛాన్సలర్ అయినప్పుడు మన సంస్కృతితో పెద్ద పరిచయం లేకపోవచ్చు. ముఖ్యమంత్రే ఛాన్సలర్ అనడంతో, వారే కులాధిపతులు కావడంతో తెలుగువారే, తెలుగుతో పరిచయం కలవారే కులాధిపతులౌతారు. దీనిని పెంచిపోషించవలసిన కులాధిపతులు, కులపతులు ముందు దశాబ్దంలో ఎందరు రాగలరో వారందరికీ నా వందనాలు. దీనిపై వారందరూ ప్రత్యేక శ్రద్ధను చూపగలరని ఆశిస్తాను.

వేరువేరు భాషలలో వ్రాసినా, భారతీయ సంస్కృతి ఒక్కటే 'Indian literature is the same though written in different languages) అన్నారు ఆచార్య సర్వేపల్లి రాధాకృష్ణ, కేంద్ర సాహిత్య అకాడమీ ప్రారంభోత్సవ ప్రసంగంలో. ఇది రాధాకృష్ణగారి శతజయంతి సంవత్సరం.

వారు ఆంధ్ర విశ్వవిద్యాలయానికి, కాశీ హిందూ విశ్వ విద్యాలయానికి చేసిన సేవలు, వేసిన పునాదులు, భారత గణ తంత్రానికి ఉపరాష్ట్రపతిగా, రాష్ట్రపతిగా చేసిన సేవలను స్మరించుకోవలసిన తరుణం. వారి పుట్టినరోజు 'ఉపాధ్యాయుల దినంగా' మనం జరుపుకుంటూనే ఉన్నాం. శతజయంతి సంద ర్భంలో ఇతర విశ్వవిద్యాలయాలతోపాటు ఈ విశ్వవిద్యాలయం కూడా ఉచితరీతిని శ్రద్ధాంజలి ఉత్సవం జరుపుతుందని విశ్వ సిస్తున్నాను.

రామాయణ, భారత, భాగవతాది ఉత్కృష్ట గ్రంథాలు, భారతీయ సంపద. వ్యాసవాల్మీకుల దగ్గరనుండి నన్నయ, తిక్కనలవరకు, తులసీదాసు, కబీరు పోతనలవరకు ఆ రామ చరితమే, ఆ కృష్ణ చరితమే ప్రబోధించినవి భారతీయ సంస్కృతి ఐక్యతను సంరక్షించినవి. మన సంగీతము, నృత్యకళ, శిల్పకళ వివిధ వేషములతో కన్పించినా మూల సిద్ధాంతము ఒక్కటే. మన సంగీతపు ధోరణులు వేరయినా మూలసూత్రం ఒక్కటే. సాహిత్యానికి వాహకమైన భాషలో 50 అక్షరాలకు పైగా ఉన్నాయి. గుణింతం, సంయుక్త అక్షరాలతో కలిపి చాలా అక్షరా లయ్యాయి. సంగీతంలో 7 స్వరాలే. వీనిని కొంచెం మార్పు లతో 16 స్థాయిలుగా పెంచుకున్నారు. ఈ చిన్న పరిధిలోనే సంగీతపారావారాన్ని సృష్టించారు. మన కర్నాటక సంగీతంలో 72 మేళకర్తలున్నాయి. ఇక జన్యరాగాలు అసంఖ్యాకాలు. ఇదే కొద్ది వ్యత్యాసంతో హిందూస్థానీ సంగీతంలో. ఒక అమృత సింధువునే మనకు ప్రసాదించిపోయారు మన పూర్వీకులు. ఎంత ఆనందసుధకు మనం వారసులం! ఇంతటి వర్గీకరణ, ఇంత స్థిరీకరణ ఇతర దేశ సంగీత సంప్రదాయాలలో లేదేమో. తాన్ సేన్, త్యాగరాజు వంటివారు ఈ సంగీతపర్వతాలలో మేరుశిఖ

రాలు. మనకు వారసత్వాన్ని ఇచ్చిపోయిన ఇట్టి ఎందరో మహానుభావులకు మనం వందనములు అర్పించవలెను. అట్లనే చిత్రకళ, శిల్పకళ, రామప్ప, కాళహస్తి దేవాలయములు ఆంధ్ర ప్రాంతములోనివి. ఎల్లోరా, అజంతాలు మహారాష్ట్ర ప్రాంతానివి. హంపి, హళిబేడు, కర్నాటక ప్రాంతానివి. మధుర, రామేశ్వరం తమిళ ప్రాంతానివి. అట్లానే ఇంకెన్నో, ఎన్ని ప్రాంతాలలోనో. అట్లానే జైనమందిరాలు, గురుద్వారాలు మసీదులు మొదలైనవి మన భారతీయ సంస్కృతి అవతారాలే. దాని భిన్న కోణాలను ప్రదర్శించేవే. తెలుగు సంస్కృతి భారతీయ సంస్కృతిలో అంతర్భాగమే. వేరేపీటను వేసుకుని కూర్చొనలేదు. భారతీయ సంస్కృతికి మతముతో సంబంధంలేదు. హిందువులు, ముసల్మానులు, జైనులు, సిక్కులు, పార్శీలు అందరూ తమ తమ పాత్ర ఉదకములతో దీనిని అభిషేకించిన వారే! భాషలతో నిమిత్తంలేదు. సంస్కృతము, పాళీ మూలముగా ఉన్నా, అనేక భాషలుగా పుష్పించాయి. ప్రాంతములూ అంతే. భారతీయ సంస్కృతి ఒక ఉద్యానవనం. చెట్లువేరైనా తోట ఒక్కటే. పువ్వులు వేరైనా, వాసనలు వేరైనా ఆ తోటలోనివే. ఆ తోటలో పాడే పిట్టలే బెంగాలీలైనా, హిందీవారైనా, తెలుగులైనా, తమిళులైనా. తమిళమాత, ఆంధ్రమాత, మరాఠీ మాతలమధ్య కర్పూరంవలె భారతమాత అదృశ్యం కాకూడదు. ఆతల్లి ఒడిలోని సంతానమే వీరు ఈ దేశైక్యతను మనం విస్మరించరాదు. భాషాభిమానం, ప్రాంతీయాభిమానం, మండలాభిమానం ఒక హద్దులోనే అణుచుకోవాలి. దేశ సమైక్యానికి ఎలాంటి హాని జరగకూడదు.

గత శతాబ్దాల భుజాలపై ఎక్కి స్వారీ చేస్తున్నది- ఈ 20వ శతాబ్దం. ఈ శతాబ్దములో ఎన్ని మార్పులను మనం గమ

నిస్తున్నాం! ఎంత అభివృద్ధి మనం తిలకిస్తున్నాం! మన పూర్వీకులు ఊహించని, కలలలో చూడని అభివృద్ధిని సాధించాం ఈ శతాబ్దంలో. ఈ శతాబ్దములో పుట్టి ఈ విప్లవాలను చూస్తూ దీని ఫలితాలను అనుభవిస్తూ ఉన్నందులకు మనం అందరం గర్వపడవలసినదే. మన ముత్తాతలకన్నా మనం ముందుకు నడిచాం. విద్య పెరిగింది. చదివేవారు, వ్రాసేవారు ఎక్కువైనారు. మనం సంతోషపడవలసిన యుగంలోనే ఉన్నాము. కాలము స్తబ్ధము కాలేదు. వికసిస్తూనే పోతున్నది.

ముందు శతాబ్దాలకు మనమిచ్చేదేమీ లేదా? గత శతాబ్దాలనుండి పుచ్చుకొనటమేనా? మన నైపుణ్యం మనమూ ఈ మూల సంపదకు చేర్చాలి. దానిని అభివృద్ధి చేయాలి. 21వ శతాబ్దంలో మన విజ్ఞాన పరిధులు ఇంకా విశాలమవుతాయి. క్రొత్త సదుపాయాలు చేకూరుతాయి. ఆ సౌకర్యాలను, ఆ సాధనాలను మానవహత్యకన్నా వారి అభివృద్ధికే, శ్రేయస్సుకే వినియోగించాలని ఆశయం. మన సాహిత్యం ఈ శతాబ్దంలో కొత్త మలుపు తిరిగింది. నన్నయ్య, తిక్కనల పలుకుబడి తుదిమాట కాదు. దానికి పదును, వడి మనం చేకూర్చుకుంటూపోతున్నాం. మన కుమారులు, మనుమలు ఇంకా దీనిని కొత్తకొత్త మార్గాలలో నడుపుకుంటారని ఆశిద్దాం. సంగీతంలో త్యాగరాజుదే కడపటి స్వరంకాదు. కొత్త బాణీలను మనం ప్రయోగించాలి. దానికి ఇంకా సొంపులను, అందాలను చేర్చాలి. 'సంభవామి యుగే యుగే' అంటున్నది మన భగవద్గీత. త్యాగయ్య సమానులు, ఇంకా మిన్నయైన వారు పుట్టాలి. ఏ దేశంలోనూ మన ఉన్నత స్థితి చివరి స్థితి కాకూడదు. ముందుకు పయనించాలి. అయినా మన దిగంతములు దూరంగానే ఉంటాయి. ప్రపంచంలో ఏమి జరిగినా దాని ప్రభావం మన మీద ప్రసరిస్తుంది. మన దేశ

వాతాయనములను తెరచుకొని అన్నిదేశాల వాయువులను మనం ఆహ్వానిస్తున్నాం. రష్యాలో ఏం జరిగినా, జపాన్‌లో ఏం జరిగినా, అమెరికాలో ఏం జరిగినా మన మీద కూడా దాని ప్రభావం ఉండనే ఉన్నది. ఇప్పుడు ఏ దేశమూ ఒక ద్వీపముగా లేదు. ఏ దేశంలో ఏది జరిగినా అది మనకు సంబంధించినదే. ఆ ప్రదేశంలో వర్ణవ్యత్యాసం ఆధారం చేసుకుని జరుగు అత్యాచారాలను మనం గర్హిస్తున్నాం. వెనుకబడిన దేశాల అభివృద్ధిని మనం కాంక్షిస్తున్నాం. మన దేశం ముందుకు పోవాలి. అందరూ మనతో సమానంగా ఉండాలి అన్నదే మన ఆశయం. 'విశ్వం ఏక నీడం' (ప్రపంచమంతా ఒకేగూడు) అట్టి పరిస్థితులలో ఒక దేశం, ఒక ప్రాంతము ప్రత్యేకంగా మనజాలవు. మానవతాభివృద్ధి హెచ్చవుతుంది. దానికే మన విద్యామందిరాలు దోహదం చేయాలి. ఒక వైపు మానవత్వమూ, ఇంకొకవైపు దేశాభిమానము, ప్రాంతీయాభిమానము పరస్పర విరుద్ధంగా కనిపించినా వీటిని సమన్వయపరచే సూత్రాలను అన్వేషిస్తూ పోవాలి. అతికించే జిగురును వెదకాలి. చెట్టును నరకడం తేలికే. దానిని పెంచడానికి దశాబ్దాలు పడుతుంది. ఈ సమైక్యమైన విశ్వసంస్కృతిలో మనమూ ఒక అంశమే. మన చీరకట్టులూ, జుట్టు ముడులూ వేరుగా కనిపించినా ఈ విభిన్నత్వంలో ఏకత్వం చూపవలసిన కర్తవ్యం ఈ విద్యామందిరాల మీదనే అధికంగా ఉంది. అందుకనే ఈ విశ్వవిద్యాలయాలు.

మన చుట్టుప్రక్కల మహారాష్ట్ర, ఒరిస్సా, కన్నడ, తమిళ, హిందీ ప్రాంతాలవారున్నారు. వారికి మనం ఇవ్వవలసినది ఎంత ఉన్నదో అంతకన్నా తీసుకోవలసింది ఎక్కువగా ఉన్నది. ఆ ప్రాంతాలు అర్థం చేసుకొనుటకు అవకాశాలేవి ? ఎంతమంది మరాఠీలకు మనం తెలుగు నేర్పాం? ఎంతమంది

మరాఠీలనుండి మనం గ్రహించాం? భాషా పండితులున్నారు. మనకు ఈనాడు ద్విభాషా పండితులు, బహుభాషా పండితులు కావాలి. దానికి కావలసిన వసతి ఇతర విశ్వవిద్యాలయాలు కాక తెలుగు విశ్వవిద్యాలయమే ఏర్పరచవలసిన బాధ్యత ఎంతయినా ఉన్నది. ఆంధ్రభారతి, భారతీయ భారతి, విశ్వభారతి ఒక దానిని ఒకటి ఆశ్లేషించుకుంటూ అన్యోన్య మైత్రీ భావంతో ముందు తరాలకు పయనించాలి. మనం చేసే యత్నాలకు పుట్టబోయేవారు హర్షించాలి. మంచి వారసులు కావాలి. కేవలం వెనుక చూపు చాలదు. భవిష్యత్తు ఆహ్వానిస్తున్నది. దాని మూగ సైగలను మనం అర్థం చేసుకుని వర్తమాన కాలంలో తగిన సన్నాహాలు చేసుకోవాలి. వర్తమానకాలం భవిష్యత్తుకు ఏమి వారసత్వంగా ఇస్తున్నదో గమనిస్తూనే ఉండాలి. భూతకాలాన్నుండి ప్రోత్సాహాన్ని పొందిన అది మాత్రమే చాలదు. అది వెనుక చూపు అవుతుంది. మనకు కనిపించని ముందు కాలాల శ్రేయస్సుకై మనం యత్నాలు సాగించాలి. మనది ముందడుగే. ముందుకు పయనించినంత వడిగా వెనకకు తగ్గలేము. సృష్టిలోనే దాని శక్తి ఉంది. మన చూపు ముందుచూపే. మనం వీపును చూడలేము. ఈ స్థాపన దినంనాడు మన ముందు తరాలను చూస్తున్నాం. వారికి ఇవ్వవలసినదేదో ఆలోచిస్తున్నాం. వెనుకటి మనిషి ముందు మనిషికి తోడ్పడాలే కాని బంధం కారాదు. అడ్డు తగలకూడదు.

డా॥ దొణప్పగారు రెండు ఉత్సవాలను ఒకే వేదికమీద జరుపుతున్నారు. నేడు తెలుగు విశ్వవిద్యాలయం స్థాపనా దినం. రవీంద్రుని ప్రభావం తెలుగు సాహిత్యం పైన అనే అంశంమీద నా ఉపన్యాసం. ఒకే సన్నాయి మేళంతో రెండు పెళ్ళిళ్ళు. రెండు విడివిడిగా జరుపుటకు వెనుకాడి, ఒకే తరుణంలో రెండు

అంశాలమీద మాట్లాడాలని వారు కోరారు. నేను స్థాపనా దినానికే ఎక్కువ ప్రాముఖ్యత నిస్తున్నాను. అట్లని రెండవ అంశమునకు అపచారం చేస్తున్నానేమో అన్న సందేహం నాకు కలుగుతూనే ఉంది. సహృదయులగు మీరు క్షమింతురుగాక.

ప్రథమ స్థాపనా దినంనాడు మీరు ఆచార్య కొత్త సచ్చిదానంద మూర్తిగారిని ఆహ్వానించారు. వారు విశ్వవిద్యాలయంలో పుట్టి పెరిగినవారు, విద్వాంసులు, వేదాంతులు. నేనేమో నాకే తెలియదు. ఆయన మీకు ప్రథమ స్థాపనా దివసంనాడు మన ప్రాచీన సంస్కృతిని గురించి ఉపన్యసించారు. ఆయన దానికి అన్నివిధాలా అర్హుడు. నాకు విశ్వవిద్యాలయాలతో ప్రత్యక్ష సంబంధం లేదు. ఉపకులాధిపతిగా, కులాధిపతిగా నిమిత్త మాత్రంగా ఉండినానేగాని, ప్రత్యక్షంగా కులపతిగా గాని ఆచార్యుడిగా కాని లేను. వారు పోయిన మార్గంలో నేను పోలేను. వారి జాడలను అనుసరించలేను. అందువల్ల నేను వేరేమార్గంలో రెండు మాటలు చెప్పదలుచుకున్నాను.

**డిసెంబరు 2,**

**1987**

II

How shall we find words to praise one whose genius flows so abundantly in lyric grace of its own immortal loveliness and shines so exquisitely in the radius of its own rainbow coloured light ?

In his life-time Dr. Tagore became the legend of enchantment to the world. After his death he has become an inspiration to all human hearts that respond to the undying message of beauty, wisdom and truth.

**Dr. Sarojini Naidu,**
**August 1943.**

అమర సౌందర్యంతో కూడిన గీత వైభవం అతి మాత్రంగా ఉండి ఇంద్ర చాప ప్రకాశంతో వెలిగే మహా నీయుని దివ్య ప్రజ్ఞను కొనియాడేటందుకు మాటలేవీ ?

డా. టాగూరు తమ జీవితకాలంలోనే ప్రపంచాన్ని సమ్మోహనపరచి కథలు గాథలు సృష్టించిన వ్యక్తి యైనారు. నిర్యాణానంతరం ఆయన నిత్యనూతనమైన సత్యం—శివం—సుందరం అన్న సందేశానికి స్పందించే సర్వమానవ హృదయాలకు స్ఫూర్తి ప్రదాత అయినారు.

డా. సరోజినీ నాయుడు
ఆగస్టు, 1943

(తెలుగు విశ్వవిద్యాలయమువారి అనువాదము)

# 2

# రవీంద్రుడు

1933 వ సంవత్సరంలో డా॥ సర్వేపల్లి రాధాకృష్ణగారు కులపతిగా ఉన్న సమయంలో డా॥ రవీంద్రనాథ టాగూరు ఆంధ్రవిశ్వవిద్యాలయంలో 'మానవుడు' అనే అంశంపై ఉపన్యసించెను అప్పుడే ప్రొ-ఛాన్సిలర్‌గా ఉండిన పిఠాపురం మహారాజుగారు టాగూర్ దగ్గరకు వచ్చారు. టాగూర్ కోరికపై వైణికవిద్వాంసుడు తుమురాడ సంగమేశ్వరశాస్త్రిని ఆరు మాసాలు శాంతినికేతన్‌లో ఉండటానికి పంపించారు. అక్కడ కొందరు శిష్యులు వీణను నేర్చుకోవటమేగాక టాగూర్‌కూడ వింటూ ఉండేవారు. కర్నాటక సంగీత ప్రభావం టాగూర్ గీతమాలలో అక్కడక్కడ కన్పించుచుండును. అప్పుడే పిఠాపురం రాజా రెండు ఎడ్లగిత్తలను, అవి లాగే రెండెడ్ల బండిని టాగూర్‌కు పంపిస్తామని చెప్పిఉండిరి. నేను ఒక పర్యాయం సెలవులకు ముందు వారి దర్శనము కొరకై పోగా ఈ విషయమే ప్రస్తావించారు. మరలా ఇప్పుడు తెలుగు విశ్వవిద్యాలయంవారు 55 సంవత్సరాల తరువాత తెలుగు సాహిత్యంపై రవీంద్రుని ప్రభావం అనే అంశం మీద మాట్లాడటానికి నన్ను ఆహ్వా

నించారు. అప్పుడు వారు స్వయంగా, ఇప్పుడు వారిని గురించి, ఒక గ్రంథాలయంలో కూర్చుని నేను ఈ విషయంపై పరిశోధన చేయలేదు. ఏ విశ్వవిద్యాలయమైనా ఈ విషయమై విపులమైన పరిశోధన చేస్తే బాగుంటుంది. ఆ పరిశోధకునికి బెంగాలీ వచ్చి ఉంటే మరీ మంచిది. కానీ నాకు కొన్ని అర్హతలున్నాయి. అందు చేతనే ఈ విషయంపై మాట్లాడటానికి సాహసించాను. 1924 నుండి 1927 వరకు నేను విశ్వభారతి విద్యార్థిని. కొన్ని రవీంద్రుని పద్యకావ్యములను తెలుగులోనికి నెల్లూరు జైలులో అనువదించాను. తిరుచునాపల్లి జైలులో రవీంద్రుని గ్రంథము ఆధారంగా కొందరికి బెంగాలీ నేర్పాను. అనంతశయనం అయ్యంగార్, సంతానం, కల్కి, విద్వాన్ విశ్వం మున్నగు వారికి బెంగాలీ నేర్పి వారికి రవీంద్రుని పరిచయం బెంగాలీలో చేశాను. జనతా మంత్రిగా ఉండిన రవీంద్ర వర్మ వగైరాలకు బళ్ళారి, అలీపురం జైళ్ళలో రవీంద్రుని పాటలు కొన్ని నేర్పించాను. రవీంద్రుని శతజయంతి సందర్భంలో నెహ్రూ, రాధాకృష్ణ అధ్యక్ష, ఉపాధ్యక్షులుగా ఉన్న అఖిలభారత టాగూర్ సెంటినరి కమిటీకి హుమయూన్ కబీర్ కార్యదర్శిగాను, రెవిన్యూ మరియు సివిల్ ఎక్స్పెండిచర్‌లో ఉన్న నేను కోశాధికారిగాను ఉండి ప్రతి రాష్ట్రంలో రవీంద్రుని పేరిట ఒక రంగస్థలమునకు ధనసహాయమిచ్చి కట్టించాము. ఒక్క మద్రాసులో తప్ప కాశ్మీరు మొదలు తిరువనంతపురం వరకు అన్ని రాష్ట్రములలో ఈనాడు రవీంద్రభారతివంటి రంగస్థలాలు ఏర్పాటయి ఉన్నాయి. ఢిల్లీలో 36 లక్షల రూపాయల ఖర్చుతో ఒక ఆరుబైట రంగస్థలం ఈ కమిటీవారే కట్టించారు. మనం ఈనాడు సమావేశమైన ఈ రవీంద్రభారతి సంజీవరెడ్డి ముఖ్యమంత్రిగా ఉన్న కాలంలో నేను కేంద్రమంత్రిగా వచ్చి శంకుస్థాపన చేశాను.

అలాగే ఉస్మానియా విశ్వవిద్యాలయంలోని టాగూర్ ఆడి టోరియం. నెహ్రూ, శాస్త్రి ఛాన్సిలర్‌లుగా ఉండిన దినములలో కొంతకాలం విశ్వభారతి సంసద్ (సెనేట్) సభ్యుడుగా ఉండి నాను. ఇందిరాగాంధీ అధ్యక్షతన 1976లో జరిగిన విశ్వభారతి స్నాతకోత్సవ సభలో ముఖ్య అతిథిగా ప్రసంగించాను. రవీంద్రుని శతజయంతి ఉత్సవాలలో మిగిలిన 12 లక్షల రూపాయలు అప్పుడు అధ్యక్షులుగా ఉన్న ఇందిరాగాంధీ అనుమతితో విశ్వ భారతిలోని రవీంద్రుని మ్యూజియమ్‌కు ఇచ్చాము. సమాచార శాఖ కేంద్రమంత్రిగా రవీంద్రుని సంగీతమును అదేబాణిలో అన్ని భారతీయ భాషలలోనికి అనువాదం చేయించి రేడియోలో ప్రసారం చేయించినాను. ఇవి చాలవా ఈనాటి నా ఈ సాహసానికి? అర్హత లేని సాహసమయితే క్షమింతురుగాక.

అన్ని భారతభాషలలోకి, ప్రముఖ విదేశీభాషలలోకి ఈయన పుస్తకాలు అనువాదం చేయబడ్డాయి. 1913లో వారికి గీతాంజలికై సాహిత్య నోబుల్ బహుమతి ఇచ్చారు. దానితో భారతీయ భాషలకు ఒక ప్రాముఖ్యం లభించింది. అంతవరకు సంస్కృతంలోనే ఉండిన ప్రాముఖ్యం దేశభాషలకు సంక్ర మించింది. ఆనాటి నుండి ఆయన కేవలం జాతీయ కవిగా మాత్రమేగాక విశ్వకవిగా రూపొందినాడు. దేశభాషలకు నూతన ఉత్సాహం, ఊపు కలగటానికి అది ఒక ప్రథమ సోపానంగా ఉపకరించింది. మరలా మన దురదృష్టమా అన్నట్లు మరెవరికీ ఆ సాహిత్య బహుమానం లభించలేదు. మొదటిసారిగా ఆ నోబుల్ కమిటీవారు భారతదేశమునుండి ఒక పేరును సూచించ వలసిందిగా కేంద్ర సాహిత్య అకాడమీని ఈ సంవత్సరం కోరి ఉండిరి. ప్రపంచదేశాలలో వచ్చిన సూచనలతోపాటు దీనిని కూడ వారు విచారించవచ్చును. త్వరలోనే ఏ భారతీయ భాషా కవికైనా వస్తుందని మనం ఆశిద్దాం.

రవీంద్రుడు కవిగానే ఎక్కువ ప్రచారం పొందినాడు. దాదాపు ఒక మూడువేల పాటలను ఆయన బెంగాలీలో రచించారు. అనేకరాగాలలో అనేక తాళాలతో భిన్న సంప్రదాయముల ఆధారంతో రచించాడు. రవీంద్రుని సంగీతం నాలుగు సంవత్సరాలలో నేర్పే కళాశాలలు కలకత్తాలో ఉన్నాయి. ఆ పాటలే చాలును వారి కీర్తిని చిరస్థాయి చేయటానికి. దాదాపు 300 కథలు వ్రాసినారు. వానిలో కొన్ని మాత్రమే ఇంగ్లిషులోకి తర్జుమా అయినవి. అవే అతనిని ప్రముఖ ప్రపంచ కథారచయితగా గుర్తింపజేసినవి. శాంతినికేతన్, విశ్వభారతి, శ్రీనికేతన్ మూడు విద్యాసంస్థలను మూడు లక్ష్యాలతో ప్రారంభించినారు. అవికూడ ఆయన ఔన్నత్యానికి తార్కాణాలే. నేను శాంతినికేతన్‌లో ఉన్న సంవత్సరంలోనే నృత్యనాటకాలు వ్రాయటానికి ప్రారంభించి ఆయనే స్వయంగా తర్ఫీదునిచ్చి అచ్చటి విద్యార్థులచే శాంతినికేతన్‌లో, కలకత్తాలో ప్రదర్శనలిప్పించారు. తన 70 వ సంవత్సరంలో ప్రారంభించి కొన్ని వందల పెయింటింగ్స్ వేశారు. ప్యారిస్ మొదలగు పట్టణాలలో వీటి ప్రదర్శన జరిగి అవి చాలా ప్రచారంలోకి వచ్చాయి. నడివయస్సులో తన నాటికలలో కొన్ని పాత్రలను ఆయనే పోషించారు. కేరళనుంచి కథకళి, సిలోన్ నుండి కాండీనృత్యం, జావా నుంచి, మణిపురి నుండి నృత్యాలు నేర్పడానికి, విద్వాంసులను పిలిపించి విశ్వభారతిలో విద్యార్థులకు నేర్పించేవారు. ఇన్ని ఔన్నత్య శిఖరాలను అధిష్ఠించారు. కాబట్టే 'Myriad-minded genius' అని ఆక్స్‌ఫర్డువారు ఒక ప్రత్యేక స్నాతకోత్సవం జరిపి ఈయనను సత్కరించినారు. సర్వకళాప్రపూర్ణుడు ఆయన. 'కళామతల్లుల గారాబుపట్టి' అని చెప్పవచ్చును. 65 సంవత్సరాలకు పైగా వారు సాహిత్య తపస్సు చేసినారని చెప్ప

వచ్చును. నవలలు, వ్యాసాలు పిల్లలకై విజ్ఞాన శాస్త్ర గ్రంథాలు, కవితలు, పాటలు అనేకం రచించినారు. కానీ బెంగాలీతరులకు అనువాదమై వచ్చింది నాలుగో వంతు మాత్రమే అని చెప్ప వచ్చును.

కాళిదాసు తర్వాత ఇంతటి మహాకవి భారతదేశంలో జన్మించలేదని నా విశ్వాసం. ప్రకృతి సౌందర్యం, దైవభక్తి, దేశభక్తి, స్త్రీ పురుష అన్యోన్య అనురాగాలు, మానవతా వాదం, విశ్వసౌభ్రాతృత్వం వారి కవితలలో ప్రముఖంగా కన్పిస్తుంటాయి. అన్నిటికన్నా మిన్నగా సమన్వయ పరచిన వ్యక్తి; ఉపనిషత్తులను మన ప్రాచీన కావ్యాలను ఆధునిక యుగ కవులను సమన్వయ పరచిన వ్యక్తి ఈయన. 19వ శతాబ్దంలో నలభై సంవత్సరాలు, 20వ శాతాబ్దంలో 40సంవత్సరాలు ఈయన జీవించారు. ఈ రెండు శతాబ్దముల అభివృద్ధిని సమన్వయ పరచారు. ఆధ్యాత్మికంగా కూడా మన తపోవన ఋషి సంప్రదాయం మొదలు ఆధునిక సంప్రదాయాలను కూడ అవగాహన చేసుకున్న వ్యక్తి. వీరి తాతగారు ద్వారకనాథ్ టాగూరును ఆయన జీవనవైఖరి వైభవాలను చూసి ప్రిన్స్ ద్వారకనాథ్ టాగూర్ అని పిలిచేవారు. తండ్రిని మహర్షి దేవేంద్రనాథ్ టాగూరు అని పిలిచేవారు. తాతగారి రాజసము; తండ్రిగారి ఆర్షవర్చసము రెండిటిని సమన్వయపరచుకున్నవారు వీరు. సుభాష్‌చంద్రబోస్. గాంధి, అరబిందు, జగదీశ్‌చంద్రబోస్, జవహర్‌లాల్ నెహ్రూ గార్లకు ఈయన చాలా సన్నిహితుడు. వారి ఆదరణ పొందినారు. గాంధీజీ దక్షిణాఫ్రికానుండి తిరిగి వచ్చిన తరువాత శాంతినికేతన్‌లో కొన్ని మాసాలుండినారు. తరువాత కూడా అనేకసార్లు దర్శించారు. హరిజనుల సమస్యపై గాంధీజీ 1932లో ఎరవాడ జైలులో నిరసన వ్రతం పూనినప్పుడు, టాగూర్

పూనాకు బయలుదేరినారు. అక్కడకు చేరగనే సమస్య పరిష్కారమై నిరహారదీక్షను గాంధీజీ మానుకున్నారు. ఆ తరుణంలో టాగూర్ హాజరై గీతాంజలి పాట పాడుతుండగా కస్తూరిబా నిమ్మరసం అందించింది. అరవిందుడు రాజకీయ నేరంపై కేసు విచారణలో ఉండగా 'అరబిందు, రవీంద్రుని నమస్కారం స్వీకరించు' అనే దీర్ఘమైన కవిత వ్రాయడం జరిగింది; అది ఆ కాలంలో నిషేధింప బడినది. పాండిచ్చేరికి ప్రత్యేకంగా వెళ్ళి వారితో సంభాషణ జరిపారు. కాంగ్రెసు అధ్యక్షుడుగా జవహర్ లాల్ నెహ్రూ శాంతినికేతన్‌కు పోయినప్పుడు 'నీవు రుతురాజువు, దేశము నీ రాకచే నూతన చైతన్యంతో పల్లవించింది' అని స్వాగతమిచ్చారు. నెహ్రూ తన కూతురు ఇందిరాగాంధీని రవీంద్రుని పర్యవేక్షణ క్రింద ఒక సంవత్సరం శాంతినికేతన్‌లో ఉంచారు. ఆనాటి ప్రముఖ శాస్త్రవేత్త జగదీశ్‌చంద్రబోసుకు స్నేహానికి చిహ్నంగా మంచి ప్రచారంలో ఉన్న పుస్తకాన్ని వీరు అంకితం చేశారు. పార్వతీ పరమేశ్వరుల ఆస్థాన కవిగా మహాకవి కాళిదాసును ఈయన చిత్రించారు. అందరి కంటే ఎక్కువ పొందిన వాడని, పొందిన దానికంటే ఎక్కువ ఇచ్చిన వాడని శ్రీరాముని సంబోధించినారు. మైథిలీ భాషా రూపంగా శ్రీకృష్ణుని బృందావన విహారాలను భానుసింగ్ అనే మారుపేరుతో రచించి తన పుస్తకాలలో చేర్చుకున్నారు. ఈయనంత మధురమైన పురుష కంఠాన్ని నేను ఇతరత్రా వినలేదు. అట్లా వ్రాతకూడ కడు సొగసుగా ఉండేది — అది పలువురు అనుసరించేవారు

వయస్సులో రవీంద్రునికన్నా నేను ఎక్కువే జీవించియున్నాను —హిమాద్రికడ ఉదయగిరి కొండలా. అవసరమైనప్పుడు - అసహాయోద్యమం, విదేశీ వస్తు బహిష్కరణ,

బీహారు భూకంపం మొదలైన విషయాలలో ఆయన గాంధీజీతో ఏకీభవించలేదు. రాజకీయాలకు దూరంగా లేరు. కలకత్తాలో కాంగ్రెసు భవనం, 'మహాజాతి సదన్'కు సుభాష్‌చంద్రబోస్ వీరిచేతనే శంకుస్థాపన చేయించారు. రెండు దేశాలకు జాతీయ గీతాన్ని ప్రసాదించిన కవిపుంగవు డీయన.

1941లో వారు స్వర్గస్థులైనప్పుడు తిరుచునాపల్లి జైలులో శ్రీమాన్ రాజగోపాలాచారి ఆధ్వర్యంలో సంతాపసభ జరిగింది. నేనే మాట్లాడినాను. విశ్వసౌభ్రాతృత్వాన్ని కీర్తించిన భవిష్యత్ ద్రష్ట. ఈ కవికి జరిగినన్ని పురస్కారాలు సమకాలీన ప్రపంచంలో మరేకవికీ ప్రాప్తించలేదు. రష్యాకు కూడా వెళ్ళి అచ్చటి విద్యావిధానాన్ని శ్లాఘించినారు. రష్యానుంచి వ్రాసిన లేఖలు ఒక ప్రత్యేక పుస్తకంగా వెలువడినాయి. లేఖా సాహిత్యంలో కూడా వీరు సిద్ధహస్తులు. కొన్ని ఉత్తరాలను పద్యరూపంగానే రచించారు. ఈయన దేశభక్తి గీతాలు బహుళ ప్రచారాన్ని పొందాయి. కాంగ్రెసు సమావేశపు వేదిక నుండే దేశభక్తి గీతాలను వినిపించారు. 'జనగణమన' ఇంగ్లీషు అనువాదాన్ని జేమ్సు కజిన్సు ఆహ్వానంపై మదనపల్లె కళాశాలకు వచ్చినప్పుడు అక్కడనే చేశారు. ఈయన సర్వతోముఖ వ్యక్తిత్వాన్ని ఎంతని, ఏమని కొనియాడగలను.

తెలుగు సాహిత్యముపై రవీంద్రుని ప్రభావము
ఇందుచేర్చుటలేదు

## 22

# వజ్రోత్సవము-స్వర్ణోత్సవము

గాంధీజీ ఉప్పు సత్యాగ్రహం చేస్తున్న సమయంలో 1930 ఏప్రిల్ 11వ తేదీన నెల్లూరు సమీపంలో మైపాడులో ఉప్పు సత్యాగ్రహం ప్రారంభించాము. తొలిజట్టులో ఐదుగురు సత్యాగ్రహులు సముద్ర జలం కాచి ఉప్పు తయారు చేశారు. నేను మొదటజట్టుకు దళాధిపతిని. దానికై శిక్ష విధించినది మే 26వ తేదీన. తోడనే నెల్లూరు జైలుకు తరలింపు. ఇది జరిగి 59ఏండ్లు దాటాయి. అన్నీ సక్రమంగా జరిగితే 1990 మే 26కు అరవై సంవత్సరాలు నిండుతాయి. షష్టిపూర్తి అర్హత సంపాదించుకుంటుంది ఈ సంఘటన. దానినే వజ్రోత్సవం అంటున్నాను. స్వరాజ్య సమరంలో అనుభవించిన తొలి జైలు శిక్షకు వజ్రోత్సవం చేసుకోవడం వింతైన విషయమేగదా !

గాంధీజీని దక్షిణాఫ్రికాలో రైలు మొదటి తరగతి పెట్టె నుండి క్రిందకు త్రోసేసిన ఉదంతాన్ని శతజయంతిని దక్షిణాఫ్రికాలో జరుపుకొన్నారు. అట్లానే నా జైలు శిక్షకు షష్టిపూర్తి జరపాలని సంకల్పం.

వయస్సులో 60 సంవత్సరములు నిండిన వారు షష్టి

పూర్తి జరుపుకుంటారు. సహస్రమాసోపజీవి అని అంటూ 80 సంవత్సరాలు నిండగానే ఆంధ్రప్రాంతంలో పండుగ చేసుకుంటారు. 79 సంవత్సరాలు నిండగానే శతాభిషేకమని తమిళ ప్రాంతంలో పండుగ చేసుకుంటారు. దాంపత్య జీవితం 70 ఏండ్లు పూర్తికాగానే వైభవం ఉత్సవం జరుపుకొనే వారున్నారు.

స్వతంత్ర సమరంలో జైలుకు వెళ్లటం ప్రముఖమైన ఘట్టమే. లాఠీ దెబ్బలు తినడం, ఆస్తి జప్తుల కింద పోగొట్టుకోవడం, ఉద్యోగాలకు రాజీనామాలు చేయడం వంటివి ఆ కార్యక్రమంలో భాగాలే. నేను జైలుకు మాత్రం పోగలిగాను. ఆ వరుసలో మూడు తడవలు జైలుకుపోవడం, 1937లో అవిభక్త చెన్నారాష్ట్రంలో తొలి కాంగ్రెస్ మంత్రివర్గంలో ఒక మంత్రిని కావడం, అంతలో ప్రపంచయుద్ధం రావడం, మంత్రి పదవులకు రాజీనామాలిచ్చి తిరిగి మూడు తడవలు జైలుకు పోవడం జరిగింది. చివరకు తంజావూరు జైలు నుండి 1943 డిసెంబరులో విడుదలయ్యాను. 1930 మే నెలలో ప్రారంభమైన జైలు తీర్థయాత్రలు 1943 డిసెంబరులో అంతమయ్యాయి. ఇది సంక్షిప్తంగా నా జైలుయాత్రల కథ. ఆరుసార్లు చెరసాలకేగినా నా తొలి జైలుశిక్ష నాకు ప్రధానమైనది. దానికే వజ్రోత్సవ సంకల్పం. అరవై సంవత్సరాలు నిండిన పండుగ.

## 'మాజీమంత్రి' బిరుదు

అలాగే, ఇరవయ్యేడున్నర మాసాల పాలన తరువాత 1939 అక్టోబరు 30వ తేదీన మద్రాసు మంత్రి మండలి, దేశంలో అన్ని కాంగ్రెస్ మంత్రి వర్గాలతోపాటు రాజీనామా చేసింది. ఆనాడు నేను 'మాజీమంత్రి'ననే బిరుదు పొందాను. ఇది నా తొలిపదవీ మాజీత్వము. దానికి 50 ఏండ్లు కావస్తున్నది.

స్వర్ణోత్సవానికి అర్హత పొందుతున్నది. ఆ తరవాత పలు పద వులు మాజీత్వాలను పొందాయనుకోండి. 1972 జూలై 1న నా కడపటి రాజకీయ పదవికి మాజీత్వము. 62 మాసాలు ఉత్తర ప్రదేశ్‌కు గవర్నరుగా ఉండి, లక్నో వదలి నెల్లూరు గూటిలో చేరాను. నా చెరసాల వాసాలను, అధికార పదవు లను ఎరిగిన నెల్లూరు ప్రజల మధ్యకు చేరాను. ఎంత ఎదిగినా, ఎన్ని దిగంతాల చూచినా, కడకు పక్షిగూడుచేరి విశ్రాంతి తీసుకోవలసినదే. అదే నా రాజకీయ పదవుల కడపటి మెట్టు.

స్వరాజ్య సమరంలో నా తొలి జైలుశిక్షకు అరవై సంవత్సరాల పండుగ. నా మొదటి రాజకీయ పదవి మాజీత్వా నికి 50 సంవత్సరాల పండుగ వజ్రోత్సవమని, స్వర్ణోత్సవమని, వాటికి పేర్లు పెట్టాను. ఆగస్టు 5న నాకు 82 సంవత్సరాలు నిండిన రోజుననే ఈ పండుగలు.

పాత ఉదంతాల కొత్త ఉత్సవాలు బతుకు బాటలో మైలు రాళ్ళు. నేను ఆనందపడే తప్పటడుగుల విజయ జయంతుల స్మారికలు.

నా తొలి జైలుశిక్ష పలు విధాలుగా ఉపకరించింది. మళ్ళీ మళ్ళీ జైలుకు పంపింది అదే. నా రాజకీయ జీవితానికి పునాది అదే. నేను ఎక్కిన పదవుల నిచ్చెనకు తొలిమెట్టు అదే. 1930 ఏప్రిల్‌లో చేసిన ఉప్పు సత్యాగ్రహంతో ప్రారంభమై, 1972 జూలైలో ఉత్తరప్రదేశ్ గవర్నరు పదవీ విరమణతో అంత మైంది. 42 సంవత్సరాలకు పైగా సాగిన నా రాజకీయ జీవిత నౌకాయానం ఎన్నో సుడిగుండాలు, అలల ఆటుపోటులు, ఎన్నో తుఫానుగాలుల తాకుడులు ఎదుర్కొంటూ, చిరగని తెరచాపల తోనే లంగరు వేశాను స్వస్థాన రేవులో. నాకు సంతోషం, సంతృప్తి

కలిగించగల విషయమేగదా!

## ముగ్గురమే మిగిలాము

నా సంతోషగగనంతో కొన్ని దుఃఖమేఘాలు కనిపిస్తున్నాయి. ఎందరో నా సహచరులు జైలులో మాసాల తరబడి నాతో కూడా ఉండినవారు స్వరాజ్యసిద్ధిని చూడకనే కొందరు, కొద్దిగా చూసి మరికొందరు దాటిపోయారు జీవనసాగరాన్ని. అమరవీరులయ్యారు. స్వార్థమెరుగక దేశవిముక్తికై కలలు కంటూ తనువులు చాలించారు.

అట్లానే ఎన్నికల పోరులో చురుకుగ పనిచేసినవారు, శాసనసభలలో సభ్యులుగ ఉండినవారు, మంత్రిపదవులను అలంకరించినవారు, ఎన్నికల ఎగుడు దిగుడులు చూసినవారు కనుమరుగై అనిమేషులైనారు పరలోకంలో. 1937లో మంత్రులైన వారిలో, ఇంకా అంతకుముందే మంత్రులైన వారిలో ఈ నాటికి ముగ్గురమే మిగిలి ఉన్నాము. మొరార్జీదేశాయ్, విజయలక్ష్మి పండిట్, నేను. దక్షిణభారతంలో మాజీమంత్రులకు పెద్దన్నను నేనే.

ఫ్రెంచి విప్లవానికి ద్విశతజయంతి ఉత్సవం ఈ సంవత్సరం. తర్వాత రష్యా విప్లవం ఈ శతాబ్దిలోనే వచ్చింది. మన దేశ స్వాతంత్ర్యం, మరి ఎన్నో దేశాల స్వరాజ్యసిద్ధికి కూడా ఈ శతాబ్ది చారిత్రక సంఘటనలే ఈ శుభపరిణామాలకు, సాధించుకున్న ప్రగతులకు సంతోషిస్తూ, త్యాగధనులను స్మరించుకుంటూ గడుపుతున్నాను నా జీవనసంధ్యా వేళలు.

10-8-1989.

2

# భిన్న దృక్పథాలు

క్రమింగుడు పడడం లేదు ! పినాకినీతీరం వ్యాఖ్య :

"నా విద్యార్థిదశలో బందరు
జాతీయ కళాశాలలో
ఒక సంవత్సరం నేను చొక్కా వేయలేదు,
దిగుమతియగుచుండిన
చక్కెరను వాడలేదు,
ఆ దినాల పరిత్యజనల వర్థంతిగా
పోరుబందరులో
నేను చొక్కా వేయలేదు
చక్కెర వాడలేదు"

1987 అక్టోబరులో డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డిగారు సతీసమేతంగా సబర్మతి ఆశ్రమం, ఉప్పు సత్యాగ్రహ స్థలమైన దండి, మహాత్ముని జన్మస్థలమైన పోర్‌బందర్ మున్నగు పునీత స్థలాలను దర్శించి, ఆ అనుభూతులను గూర్చి వ్రాసిన "నా నవజీవన యాత్ర" గేయరచనలోనిది పై ఖండిక. గోపాల

రెడ్డిగారు స్వాతంత్ర్య పోరాటంలో 1930 మొదలు 1943 వరకు ఆరుసార్లు జైలుకుపోయారు; మొత్తం 48 మాసాలు జైలుశిక్ష అనుభవించారు. 1937 మంత్రిత్వం మొదలు ఉత్తరప్రదేశ్‌లో గవర్నరుగా పదవీ విరమణ చేసేవరకు 248 మాసాలపాటు ఉన్నత అధికారపదవులను నెరపారు. వీటన్నిటికంటే చెప్పుకో దగింది 1921 లోనే ప్రభుత్వ పాఠశాలలు బహిష్కరించారు. అటువంటి దేశభక్తుడు, త్యాగశీలి, అనుభవశాలి అయిన మహా వ్యక్తినిగూర్చి ఏ అర్హతా లేని నేను వ్యాఖ్యానించబూనడమంటే సాహసమేకాదు, పిల్లపోయి గ్రుడ్డును వెక్కిరించినట్లుగా వుండదా ?

ఆ జంకు చేతిని వెనక్కు లాగుతూనేవుంది. అయినా ఆయన రామారావుగారి సోమశిలసభకుపోవడం నాకు మ్రింగుడు పడడంలేదు; నా మనసు సమాధానపడడంలేదు. మ్రింగలేక కక్కలేక, సమాధానపడలేక చెప్పుకోలేక నా మనసును తేలిక పరచుకోడానికి నొచ్చుకుంటూ ఈ నాలుగుమాటలు వ్రాయ వలసివస్తున్నది-క్షమార్హుడ !

26 తేది ముఖ్యమంత్రి శ్రీ. ఎన్. టి. రామారావు సోమ శిల ప్రారంభోత్సవసభలో గోపాలరెడ్డిగారు పాల్గొనడం, వంగి రామారావుగారిచేత ఒక శాలువ కప్పించుకొని సంతోషాంత రంగుడు కావడం చూచి దిగ్భ్రాంతికలిగింది. అంతేకాదు,అక్కడ ఆయనకు లభించిన ప్రాముఖ్యత, చూపబడిన గౌరవమర్యాదలు, తననుగూర్చి ముఖ్యమంత్రి ఒక్కమాట చెప్పకపోగా కాటన్ కలలను పరిపూర్తిచేసిన వ్యక్తిగా రామారావును గోపాలరెడ్డి గారు ప్రశంసిస్తూ మాట్లాడాడని విన్నప్పుడు మనసు చివుక్కు మన్నది. అదే ప్రధాని రాజీవ్‌గాంధి నెల్లూరు సభలో గోపాల

రెడ్డిగారి పరోక్షంలో ఆయన్నుగూర్చి ఎంత గొప్పగా మాట్లా-
డారో మనందరికీ తెలుసు గదా! గోపాలరెడ్డిగారు విశాల హృద
యులు, రాగద్వేషాలకు, తన పర భేదాలకు అతీతులు. అందు-
వల్ల ఈ లోటుపాట్లు ఆయన మనసుకుకూడా వచ్చి వుండవు;-
కాని ఆయన అంతస్తును అందుకోలేని సామాన్య కాంగ్రెసు వాదు-
లకు, ఆయన అభిమానులకు మాత్రం తీరని భేదాన్ని
కల్గించింది; తాము అవమానితులమైనట్లు వారు భావించారు.

అసలు గోపాలరెడ్డిగారు అననుకూలమైన టైంలో అంత
దూరం ప్రయాణించి ఆ సభలో పాల్గొనవలసిన అవసరం ఏమి
కలిగింది? ముఖ్యమంత్రిగారు స్వయంగా ఏమైనా ఆహ్వా-
నించారా? ముఖ్య అతిథి అనే పేరు ఆహ్వాన పత్రికలలో ఏమైనా
వేశారా? అవేమీ వున్నట్లులేదే! సోమశిలతో తనకు ప్రత్యేక
అనుబంధమేమైనా వున్నదా? సోమశిల ప్రాజెక్టును ఒకసారి
చూడాలనే అభిలాష కలిగిందా? అనుబంధమున్నా, చూడ-
దలచుకున్నా రామారావు ప్రారంభిస్తున్నరోజే, ఆ తెలుగుదేశం
వేదికమీదనుండే చూడవలసిన అవసరం ఏమికలిగింది ? -
ముందుగాని, వెనుకగాని గునుపాటివంటి అభిమానులతో
విశ్రాంతిగాబోయి హాయిగా చూచివచ్చి వుండవచ్చు గదా?

సోమశిల ప్రాజెక్టును జాతికి అంకితం చేయడానికి, ఆ
వేదిక మీదనే గోపాలరెడ్డిగారిని సన్మానించడానికి సమయ
సందర్భాలేమిటి? ముందే ఏర్పాటైన కార్యక్రమమైతే ఆహ్వాన
పత్రికలలో వుండివుండాలగదా? లేదే! శాల్వా సన్మానంకూడా
ముందు అనుకున్నదికాదు, గోపాలరెడ్డిగారి కోసం తెప్పించిందీ
కాదు. తనకు ఒక తెలుగు శాసనసభ్యుడు వేసిన రెండు
శాల్వాలలో ఖరీదైనదానిని స్వంతంచేసుకొని, రెండవ దానితో
గోపాలరెడ్డిగారిని సన్మానించి గొప్ప అనిపించుకున్నాడు రామా

రావు. ఆ సంగతి గోపాలరెడ్డిగారికేమి తెలుసు? రామారావుగారు తన సహజధోరణిలో కాంగ్రెస్‌ను నోటికొచ్చినట్లు తిట్టారు. నలభై రెండేళ్లు దేశాన్ని కాంగ్రెస్‌వాళ్ళు 'లూటీ' (దోపిడి) చేశారు అని నిందించాడు. అదేవిధంగా కాంగ్రెస్‌ను కాంగ్రెస్‌వాదులను దుమ్మెత్తిపోశాడు. గోపాలరెడ్డిగారిని వేదికమీద ఆశీనులను చేసి, కాంగ్రెస్‌ను కాంగ్రెస్‌వాదులను అంత నీచంగా తిట్టాడంటే, గోపాలరెడ్డిగారిని దూషించినట్లుకాదా? రామారావుగారు అంత నిర్లక్ష్యంగా మాట్లాడినతర్వాత గోపాలరెడ్డి గారు ఆ వేదికమీద ఎట్లా కూర్చోగలిగారు? ఆయనచేత శాల్వ సన్మానం ఎట్లా చేయించుకోగలిగారు? ముఖ్యమంత్రికి సోమశిల సూపరింటెండింగు ఇంజనీరు గారిచ్చిన ఖరీదైన మెమెంటోను ఎట్లా అందజేయ గలిగారు? ఆ వాతావరణాన్ని ఎట్లా సహించ గలిగారు?

అంతటితో పోలేదు-కాటన్‌దొర రూపకల్పనజేసిన సోమశిలను రామారావుగారు పనిపూర్తి చేయగలిగారని ఆయన్ను అభినందించారట గోపాలరెడ్డిగారు. సోమశిలకు కాంగ్రెస్ చేసింది అల్పం; దాన్నిపూర్తిచేసిన ఘనత తెలుగుదేశం ప్రభుత్వానిదని రామారావుగారు పరనింద స్వోత్కర్ష చేశారు. గోపాలరెడ్డివంటి కాంగ్రెస్ పెద్దచేత సోమశిలను పూర్తిచేసిన కీర్తి రామారావుదేనని సంశ్లోకించుకోగలిగాడంటే, కాంగ్రెస్‌వారి చేత కాంగ్రెస్‌వారి కన్ను పొడిపించడంతో సమానంకాదా?

సోమశిలకోసం ఎందరు ఎన్ని సంవత్సరాలపాటు తపస్సుచేయలేదు? కృష్ణ-పెన్న ప్రాజెక్టుపోయినా - తర్వాత సోమశిల ప్రాముఖ్యాన్ని గుర్తించి దాని ఆవశ్యకతను నొక్కి చెప్పినవాడు కె.ఎల్. రావు, కీర్తిశేషులు బెజవాడ రామచంద్రా

రెడ్డి, వంగల్లు కోదండరామిరెడ్డి, ఎ. సి., జి. సి. కొండయ్య వంటి జిల్లాముఖ్యులెందరో దానికోసం ఆందోళనచేశారు. ఆంధ్ర గవర్నరు త్రివేది, కేంద్ర ఇర్రిగేషన్‌మంత్రి హాథివంటి పెద్దలు ఎందరువచ్చి సోమశిలను చూచిపోలేదు? సోమశిల, గండిపాళెం లకు శంకుస్థాపనచేసి, వెంటనే నిధులుమంజూరుచేసి, పనులు ప్రారంభించింది కాంగ్రెస్ ముఖ్యమంత్రి శ్రీ వెంగళరావు; కావలి-కనుపూరు కాల్వలకు పునాదిరాయి పడింది కాంగ్రెస్ ముఖ్య మంత్రి స్వర్గీయ సంజీవయ్య చేతులు మీదుగానే. 1983 వరకు ఆ ప్రాజెక్టులకు నిధులు కేటాయించింది, అంతవరకు పని జరిపించింది కాంగ్రెస్ ప్రభుత్వాలే. ఈ కృషిఅంతా బూడిదలో పోసిన పన్నీరై, రెండేళ్ళనాడే అనుభవానికొచ్చిన సోమశిలకు రెండవసారి ముఖ్యమంత్రిచేత ప్రారంభోత్సవం గావించ బడడమే పొగడ్తలకు పాత్రంగావడం, అది గోపాలరెడ్డిగారి వంటి కాంగ్రెస్ కురువృద్ధుని సమక్షంలో జరగడం, కాంగ్రెస్ దురదృష్ట మనుకోవాలి-అంతే!"

నేను హైదరాబాదునుండి వచ్చి 'పినాకినీతీరం' వ్యాఖ్యను చూచాను. 'జమీన్‌రైతు' నా అభిమాన పత్రిక కాబట్టి, నా సమాధానం వ్రాస్తున్నాను. వీలుంటే ప్రచురించండి.

నేను 22వ తేది కలెక్టరుకు ఫోన్‌చేశాను. వీలుంటే 5, 10 నిమిషాలు మాట్లాడతానని చెప్పాను. నాదే తొలిమెట్టు. సోమశిల చీఫ్ ఇంజనీరు మాయింటికివచ్చి ఆహ్వానపత్రిక యిచ్చారు. 25 ఉదయం ముఖ్యమంత్రి ఫోనులో ఆహ్వానించారు. కలెక్టరు ప్రయాణ సౌకర్యాలు కలిగిస్తూ, ఒక ఉద్యోగిని వివరాలు చెప్పమని పంపారు. వెళ్లాను.

ముఖ్యమంత్రి హెలికాప్టర్ 2½ గంటలు ఆలస్యంగా

వచ్చింది. జిల్లాపరిషత్ అధ్యక్షులు స్వాగతం పలుకగా, ముఖ్య మంత్రి ఉపన్యసించారు. నేను ఆయన వెనుకనే కూర్చుండి యున్నా, మైకు మాటలు నాకు అర్థంకాలేదు. నాకు కొంత చెముడు ఎక్కువగుచున్నదని గమనిస్తున్నాను. ఆవేశముగానే మాట్లాడుచున్నట్లు గమనించాను. మీ భావాలు ఏమన్నావుంటే చెప్పండి అని ముఖ్యమంత్రి అన్నారు. చెప్పేది ఏమీలేదు. సోమ శిలను పూర్తిచేసి ప్రజలకు అంకితంచేస్తున్న మీకు వందనము తెలుపడమే అంటూ లేచి ఒక్క నిముషమే మాట్లాడాను. నేను 1938 సం॥లో మద్రాసు మంత్రిగా, నీటిపారుదల మంత్రి యైన యాకూబు హుసేన్‌ను తీసుకవచ్చాను. మా ఎన్నాళ్ళ కలలపంటో, కృష్ణా–పెన్నారు ప్రాజెక్టు భాగంగా, కాటన్ ప్రణాళికలోకూడ ఉన్నదేమో, నేడు మీరు ప్రజలకు అంకితము చేస్తున్నారు; వారి తరపున వందనములని చెప్పాను. అంతే; కాని నేను చెప్పతలచినది కొంత ఉంది:

1. యాకూబ్‌హుసేన్‌తోకూడా నేను మద్రాసుమంత్రిగా వచ్చి వారికి సోమశిలను, గండిపాళెంను చూపించాను. 1962లో ఏ.సి. సుబ్బారెడ్డి నీటిపారుదల మంత్రిగా ప్రయత్నించారు. శ్రీనివాసులరెడ్డి పని సాగించారు.

2. బెజవాడ రామచంద్రారెడ్డి పార్లమెంటులో సోమశిల విషయము చాలాసార్లు మాట్లాడారు.

3. వంగల్లు కోదండరామిరెడ్డి. నేను ఊరులు తిరిగి, వందరూపాయలకు మించని విరాళాలు వసూలుచేసి, వేలుపోగు చేశాము. సోమశిల పార్టీకి అతీతముగా ఉండాలని రామచంద్రా రెడ్డినే అధ్యక్షులుగా, కోదండరామరెడ్డి కార్యదర్శిగా, ఏ.సి., నేను ఇతరులు సభ్యులుగా వ్యవహరించాము. రామచంద్రారెడ్డి ప్లానింగ్‌లో ఉండిన హోదాని సోమశిలకు తీసుకవచ్చారు.

4. జిల్లాపరిషత్తు అధ్యక్షులుగా ఉండిన మేనకూరు గోపాలకృష్ణారెడ్డి 700 రైతులను ప్రత్యేక రైలులో చలికాలములో తీసుకవెళ్ళి, ఇందిరాగాంధీ, కె. ఎల్. రావులకు రైతుల వినతిపత్రమును అర్పించారు. అది 1971లో.

నేను ఢిల్లీలో ఉన్నపుడు కె.ఎల్. రావుతో చాలాసారులు మాట్లాడినాను. ద్రవ్యమువిషయము, డామ్ ఎత్తువిషయము, మునకఅయ్యే కడపరైతుల విషయము.

5. 1975లో ముఖ్యమంత్రి వెంగళరావు శంకుస్థాపన చేశారు. మంత్రి ఆనం వెంకటరెడ్డి మాట్లాడినాడు, నేను ఏ కారణముచేతనో ఆ ఉత్సవానికి హాజరుకాలేక పోయినాను, రేడియోలో వివరాలు విన్నాను.

కాన కొంత సంబంధము వున్నది. నా తొలి సోమశిల దర్శన స్వర్ణోత్సవమని అధికారులతో, స్నేహితులతో అన్నాను. ఈ స్టేజి పూర్తియై, ప్రజలకు అంకితమగుచున్న ఉత్సవము నాకు ఆనందదాయకము కాదా? ఆగస్టు 15, జనవరి 26 పతాక వందనము మంత్రిగాని కలెక్టరుగాని తీసుకొన్న, నా కర్తవ్యముగా హాజరవుతాను. మంత్రి శీనయ్య తమ పార్టీ విషయమే మాట్లాడినారు. ఆ సందర్భము పార్టీకి అతీతమైనదని తలచే హాజరగుచున్నాను.

ఎవరు స్వాగతమిచ్చారు, ఏమియిచ్చారు, ఏమిమాట్లాడారు నాకు సంబంధము లేదు. గంగా కమలమునకు తూడు (మృణాళము) దీర్ఘమైనదని, ఇన్నాళ్ళకు యీ స్టేజి పూర్తియైనదని ముఖ్యమంత్రికి వందనములు తెలుపుట ఉచితమని తలుస్తున్నాను. ఇది కాంగ్రెసుది కాదు, తెలుగుదేశముది కాదు, స్వతంత్ర పార్టీది కాదు; ప్రజలది, ప్రజలచేత ఎన్నుకోబడ్డ ముఖ్యమంత్రి

ప్రజలకు అంకితముచేశారు. నేను వందనములు పలికాను. హైదరాబాదునుండి తెచ్చిన శాలువనే, ఆంధ్రప్రదేశ ప్రభుత్వము తరపున అంటూ కప్పారు. నాకెందుకు ఈ సన్మానమని నవ్వుకొంటూ, భుజము వంచాను.

యు. జి. సి. తరపున ఛాన్స్లరైన ముఖ్యమంత్రిచే నియమింపబడిన ప్లానింగ్ బోర్డు సభ్యునిగా (తెలుగు విశ్వవిద్యాలయానికి) పనిచేస్తున్నాను. సాహిత్యఅకాడమీ, తెలుగుభాషా సమితి అందులో విలీనమయ్యాయి. స్థాపనా దివసమునకు పోయినయేడు నేను వక్తను. డిశంబరు 2న మూడవ సంస్థాపనాదినము నా అధ్యక్షత క్రిందే, విద్యామంత్రి ఇంద్రారెడ్డి ముఖ్యఅతిథి. తెలుగు విశ్వవిద్యాలయము రామారావు హయాంలో స్థాపింపబడ్డా తెలుగుదేశం పార్టీదికాదు. పానుగల్లు స్థాపించిన ఆంధ్రవిశ్వవిద్యాలయం జస్టిస్ పార్టీదికాదు.

84 సం॥లో కాబోలు రవీంద్రభారతిలో ముఖ్యమంత్రి ఉగాది సందర్భంగా నాకు శాలువాకప్పారు.

సాహిత్య అకాడమీ విషయమై, నార్ల, రామానుజరావు నాతో ముఖ్యమంత్రి గదిలోనే సంప్రదింపులు జరిపారు. తర్వాత ఇంటికి తీసుకపోయి స్వంత భోజనమే పెట్టారు.

తెలుగుదేశం, కాంగ్రెసు విమర్శనలు చేసికొనవచ్చును; ఒకరిని దింపి, ఇంకొకరు గద్దె ఎక్కాలని ప్రయత్నించడం ప్రజాస్వామికపు విజయం. తుమ్మితే ఊడే ముక్కుకాదు నా కాంగ్రెసు. త్యాగాలకు ఓర్చి, పెద్దపెద్ద జాతీయనాయకుల విమర్శలకు గురియైనదే కాంగ్రెసు. ముఖ్యమంత్రి ఆవేశముగా మాట్లాడినా, కాంగ్రెసును విమర్శించినా గట్టిపడేదే కాంగ్రెసు.

నెహ్రూ ఈ ప్రాజెక్టుల విషయమై, ఇవే నవీనమందిరాలు

అన్నారు. నాకు యివే మందిరాలు, తీర్థధామాలు, గంగా భవాని దేవాలయాలని తలుస్తున్నాను. భాక్రానంగల్ ఈ పవిత్ర భావముతో చూచాను. నేను ముఖ్యమంత్రిగా శంకుస్థాపన నాగార్జున సాగర్‌కు ప్రధాని నెహ్రూచేత చేయించాము. నేను ఈ నెల 3, 4 తేదీలలో చూచివచ్చాను. పోచంపాడు, శ్రీశైలం, శ్రీరాం సాగర్‌ను చూడాలని ఉత్సుకపడుచున్నాను.

సోమశిలకు గోపాలరెడ్డికి ఏం సంబంధము అనుట కొంత వింతగా తోచినది. పాపిరెడ్డి షష్టిపూర్తికి వెళ్ళాను. తెలుగుదేశం పెళ్ళిళ్ళకు వెళుచున్నాను.

కడపటిమాట, మొన్న నవంబరు 14న మన ముఖ్యమంత్రి సెలవు దినముగ ప్రకటించారు. చాల ప్రభుత్వాలు చేయలేదేమో, నెహ్రూ శతజయంతి సందర్భముగ. నెహ్రూను పార్టీకి అతీతంగా భావించడాన్ని నేను హర్షించాను.

ఆంధ్రుల ఐక్యతను కాపాడింది ఇందిరాగాంధి అని జోహార్లు అర్పించాను ఇంద్రారెడ్డి ఎదుట; తెలుగు విశ్వవిద్యాలయం వేదికనుండి.

కొన్ని విషయాలను పార్టీలకు అతీతమని భావించేవాడిని. సోమశిల అట్టిదే. దీనికి కొందరు ఆగ్రహించారంటే, నేను ఏమి చేయగలను ?

బెజవాడ గోపాలరెడ్డి

5-12-1988

## మనసు నొప్పించాను!

గతవారం ముఖ్యమంత్రి శ్రీ రామారావు సోమశిల సభలో తాను పాల్గొనడంపై నేను చేసిన వ్యాఖ్య శ్రీ గోపాలరెడ్డిగారి మనసు నొప్పించిందా అనిపిస్తున్నది. ఆయన అందరివంటి రాజకీయ నాయకుడు కాదు; చీటికిమాటికి ప్రకటనలతో పత్రికల కెక్కే అలవాటు ఆయనకు లేదు; గోపాలరెడ్డిగారి ప్రకటనంటూ మనం ఎన్నడూ పత్రికలలో చూడము. తనమీద విమర్శ లొచ్చినా ఒక చిరునవ్వునవ్వి పూరుకుండిపోతారుగాని; వాటికి జవాబివ్వాలని అనుకోరు. అటువంటి సహనము సంయమనము కలిగిన గోపాలరెడ్డిగారిచేత ఇంత సుదీర్ఘమైన సమాధానం వ్రాసేట్లు చేసినందుకు నాకు ఎంతో బాధగావుంది.

గోపాలరెడ్డిగారిని విమర్శించడం, మనసు నొప్పించడం నా వుద్దేశ్యం కానేకాదు. "నా మనసును తేలికపరచుకోడానికి నొచ్చుకుంటూ ఈ నాలుగుమాటలు వ్రాయవలసి వస్తున్నది—క్షమార్హుడ!" అని గతవారం మొదట్లోనే చెప్పుకోవడంలో నా భావం అదే! అంతేకాదు; గతవారం నా వ్రాతలోని ఈ నాలుగు వాక్యాలుకూడా చదవండి — "గోపాలరెడ్డిగారు విశాలహృదయులు. రాగద్వేషాలకు, తనపర భేదాలకు అతీతులు. అందువల్ల ఈలోటుపాట్లు ఆయన మనసుకుకూడా వచ్చివుండవు. కాని ఆయన అంతస్తును అందుకోలేని సామాన్యకాంగ్రెస్‌వాదులకు, ఆయన అభిమానులకు మాత్రం భేదాన్ని కల్గించింది; తాము అవమానితులమైనట్లు వారు భావించారు". ప్రక్కనే ప్రకటితమవుతున్న గోపాలరెడ్డిగారి జవాబును సాంతం చదివినవారికి, ఆయననుగూర్చి, ఆయన స్వభావాన్నిగూర్చి నాకు సరైన అవగాహన వున్నదని ఏకీభవిస్తారనుకుంటాను. గతవారం ఈ శీర్షిక క్రింద వెలిబుచ్చబడిన అభిప్రాయాలు కేవలం నా ఒక్కడివి

కావు; మినహాయింపులేకుండా ఆయన్ను ఆరాధనాపూర్వకంగా అభిమానించే వారందరి అభిప్రాయాలకు అవి ప్రతిబింబాలని మనవిచేస్తున్నాను. నేనుకాని, నావంటి ఆయన అభిమానులైన కాంగ్రెస్‌వాదులుకాని ఆ విధంగా అభిప్రాయ పడ్డారంటే, కేవలం గోపాలరెడ్డిగారు సోమశిలకు పోయినందుకు, రామారావుగారి సభలో పాల్గొన్నందుకు కాదు; అక్కడ ఆయన స్థాయికి తగినట్లు గౌరవం చూపబడలేదనే ఆవేదనే అందుకు కారణం. ఆ పూట సోమశిల కార్యక్రమాలకు హాజరైన ప్రతిఒక్కరికి-కొందరు అధికార్లతో సహా—అటువంటి అభిప్రాయమే కలిగింది.

1938 లో ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో మంత్రిగా తాను, తన సహచరుడైన ఇర్రిగేషన్ శాఖామాత్యులు యాకూబ్ హుసేన్‌గారిని తీసుకొనివచ్చి సోమశిల ప్రాజెక్టు స్థలాన్ని చూపించారనే విషయం నాకు తెలియదుకాని; సోమశిలకు ప్రాధాన్యం కల్గిన కృష్ణ-పెన్న ప్రాజెక్టుకోసం గోపాలరెడ్డిగారు ఎంత కృషిచేసింది, సర్కారు జిల్లాలవారి విమర్శలకు ఎంతగా గురియైంది నేను మరచిపోలేదు. శ్రీ మేనకూరు గోపాలకృష్ణారెడ్డి సోమశిల ప్రాజెక్టు కోసంగా ఒక స్పెషల్‌రైలులో నెల్లూరు రైతాంగాన్ని ఢిల్లీకి రాయబారం తరలించిన విషయం గతవారం వ్రాసేటప్పుడు సమయానికి స్ఫురణకు రాలేదుకాని, ఆ రాయబారానికి సంబంధించి సచిత్రకంగా ప్రత్యేక వార్తా కథనాలు ప్రకటించిన నేను ఎట్లా విస్మరించగలుగుతాను? అట్లానే, 1938 నుండి అధికారంలోవున్న గోపాలరెడ్డిగారికి ఒక్క సోమశిలతోనే కాదు, జిల్లాలోని అభివృద్ధి కార్యాలన్నిటితో అనుబంధం లేకుండా వుంటుందని పొరపాటుగానైనా ఎవ్వరనుకోగలరు? మద్రాసులో ఓమందూరు రామస్వామిరెడ్డియార్ మంత్రివర్గ సభ్యుడుగా శ్రీ గోపాలరెడ్డిగారు జిల్లాలో ప్రొహిబిషన్ ప్రచార పర్యటన

మొదలు ఉత్తరప్రదేశ్ గవర్నరుగా వారు పదవీ విరమణ చేసేంతవరకు జిల్లాలో పని చేయలేదని చీటికిమాటికి అనడం స్వతంత్ర భారతదేశపు ప్రథమ ప్రధానిగా పద్నాలుగేళ్ళపాటు వుండిన నెహ్రూను కూడా నిందించడంకాదా? సభల్లో దూషిస్తూ ఆయన శత జయంతికి సెలవు ఇచ్చినంత మాత్రాన సంతోషించ గలమా ?

ముందేచెప్పినట్టు గోపాలరెడ్డిగారి విశాల దృక్పథం. ఔదార్యవైఖరి ప్రయత్నించినా అందరికీరావు. ఆయన అంతస్తును అందరూ అందుకోలేరు. అవి నిజంగా వరప్రసాదాలే. ఆచరించ గలిగినా లేకపోయినా కొన్ని విషయాలను పార్టీలకు అతీతంగా భావించాలనే గోపాలరెడ్డిగారి విలువైన అభిప్రాయంతో ఏకీభ వించనివారెవరూ వుండరు.

నీతినిష్ఠలు కలిగిన తొలితరం గాంధేయ కాంగ్రెస్ నాయకుడుగా గోపాలరెడ్డిగారిపట్ల వున్న భక్తి గౌరవాలతో సదుద్దేశ్యంతో చేసిన వ్యాఖ్య ఆయనకు ఆగ్రహావేశాలు కల్గించి నట్లుంది. అందుకు విచారిస్తూ, మరొకసారి క్షమాపణ చెప్పు కొంటున్నాను.

✱✱